# ఉషా గ్రంథమాల

( తొలి కుసుమము )

ప్రథమ ముద్రణము — 1000 ప్రతులు.

డిశెంబరు 1946.



మూల్యము,
రూ 1-8-0

శ్రీ

# ఆంధ్రసత్కృతి.

( తెలుఁగు వీక్షణం )

## ప్రథమోల్లాసము

కాలగర్భంబులో నడుగంటిపోయె
ఆంధ్ర సామ్రాజ్యమైన నా యతుల సౌర
భంబు మాయదు; ఆంధ్ర బంధురము ! దాని
నాని ఝంకార మొనరింపు మన్నిదిశల.

క్రొవ్విడి వేంకటరత్నశర్మ. B. A.

మంచుంబాల మదీయాభగ్న కవితానుభూతింగి; కష్టంబునే
కొంచెంబున్ బడలేను; పేశలమృదూక్తుల్ పల్కగా కొల్పిమ్మింగా; నా
మంచుంజాయల నిల్చుగాని, కవితామగ్నంబులన్ జిల్చు గో
పాంచద్భీషణ తర్కవాదముల నాస్వాదింప లేనెయ్యెడన్.

# అంకితము.

"అవిరళభస్మంబు నందున్నయట్టి
అగ్నికణంబుల ననుకరించెడిని
ఆంధ్రుల శౌర్యంబు లంతట నేఁడు"

—మాతృస్మృతి.

"ఆంధ్రులు ప్రియంకరులు; స్వచ్ఛందశీలురు; హాల కవిరాజు మొదలు జగన్నాథ పండితరాజుదాఁకా వారిప్రా కళాకాలీనం ధారావాహినిగాఁ బ్రవహించినది."

"ఆంధ్రుఁడు ప్రేమస్వరూపి; సౌందర్య పిపాసి. అతఁడు నిత్యోత్సాహి; ఏడుపులో అతఁడు నవ్వఁగలఁడు; కష్టాలమధ్య నతడు నిస్సంగియై సుఖింపగలఁడు; అతడున్న చోట వెలుతురు వ్యాపిస్తుంది. అతడు పోరాడినచోట సౌరభము విరియఁబాఱుతుంది."

కళోపాసకులును రసజిఘృక్షువులును, అరిభయంకరులును, విశాలహృదయులును, పురాణాంధ్రులు నగు తెలుఁగులోకమునకు ఈ ఖండకావ్యమును భక్తిప్రణామ పురస్సరముగ సమర్పించుచున్నాడను,

కొంవ్వోడి వేంకటరత్నశర్మ.

# ఆంధ్రసంస్కృతి.

## విషయ సూచిక.



### పూర్వభాగము.

Lalita Kuteer,
Secunderabad [Dn.],
3 rd January 1947.

The author calls his poems 'Andhra Smriti' or 'Tenugu Veethulu'. They are really like picture galleries of varying colours, poses and themes. Dear is his own country, dearer the sweet home and dearest perhaps is the mother tongue. The poet in an intense mood of recollection sings the immortal glory of his people, country and their history. Some of the verses are inspiring and some are even exciting but all are marked with a vigorous thinking which seems to be germane to the poet's composition. Sree Ratnam is a poet of the Godavery plains and his poetry partakes the width and grandeur of that Proud River. He pours never rains.

Rayaprolu Subba Rao.
(Osmania University)

"ఆంధ్రజాతి మహత్తరమైనది. అమరావతి శిల్ప సంప్రదాయము, నాగార్జునుని తాత్త్విక సంప్రదాయము మనకు ఆంధ్రజాతి ప్రసాదించినది. ఇండో-చైనా, జావా, సుమిత్రాలను నాగరికం చేసిన నౌకలు; బహుశా ఆంధ్ర తీరం నుండి వెళ్లినవే .... గత చరిత్రలో ఇంత మహత్తరమైన దేశం, భావి చరిత్రలోకూడ మహత్తరమైనది కాక తప్పదు."

జి, జౌవే - దుబ్రేయుల్,

(సుప్రసిద్ధ పాశ్చాత్య చరిత్రకారుడు.)

# పరిచయము.

శ్రీరత్న కవిగారికిని నాకును ఉన్న సమాన ధర్మమే ఈ మాటలకు ప్రేరకము. ఆయన సాహిత్య పిపాసి. నేనును నంతే!

నేనీపద్యముల వినినపుడు వానిలో కొన్నిటియందు గల మాతృ దేశాభిమానము, భాషాభిమానము నన్ను మైమరువఁ జేసినవి. అందుచే నీ మాటలను వ్రాయనన లేక పోతిని

శ్రీరత్నకవిగారు ప్రత్యణుపును ఆంధ్రుఁడు! కవి! ఈయన చిన్నతనమునుండియే కవితఁ జెప్పు శక్తి కలవాడు. కాని, ప్రకటించు గ్రంథమిదే మొదటిది. ఇందుఁకు ఆయన వినయమే కారణము; గాని, మరియొకటి గాదు. దానిని నేను చెరచి ఈ పనికి పురికొల్పితిని.

పాఠకు లిందు రసాస్వాదనము చేయఁగలరని నాకు గట్టి నమ్మకము గలదు.

శ్రీరత్నకవిగారిని యింతోధికముగా గ్రంధ ప్రచురణము చేయుమని కోరుచు, ఈ ద్విశత పద్యములను పాఠకులకు అర్పించుచున్నాను.

89 B. Nampally,
Hyderabad (Dn.)
2-6-1945.

ఇట్లు,
(Sd) కురుగంటి సీతారామయ్య M.A.
(Nizam College)

'సరస్వతీ కంఠాభరణ'
"విద్వాన్ వేదుల సూర్యనారాయణ శర్మ"
తెలుఁగు పండితుఁడు.
బోర్డు హైస్కూల్ — తణుకు.

శ్రీ కొవ్విడి వేంకటరత్న శర్మగారి 'ఆంధ్ర స్మృతి' లోని యచ్చటచ్చటి కొన్ని పద్యములను విని యానందించి తిని. పాత్రమంతయు ఆంధ్రాభిమానము గుమ్మరించుచు పాఠకుల నావేశపూరితులం జేయుచున్నది. చక్కని శయ్యా నలవరించుకొని శ్రీ శర్మగారి కవిత్వము ముద్దులమూట గట్టుచున్నది.

ఇది వారికి ప్రథమ ప్రయత్నమైనను పాఠకుల కట్లు తోపింపక చేయితిరిగిన కవిత్వమువలె ధారావాహినియై యలరారుచున్నది. వీరి కవిత్వముత్తరోత్తరా అభివృద్ధి నొంది దేశోపకారములగు కావ్యముల సృష్టికి మూలమై, వెలుఁగొందఁగలదని యాశించుచున్నాను.

తణుకు,
13-7-44.

(Sd) వేదుల సూర్యనారాయణ శర్మ,
ఆంధ్ర లక్ష్మీ సహస్ర గ్రంథకర్త.

శ్రీ కొవ్విడి వేంకటరత్న శర్మగారు రచియించిన "ఆంధ్ర స్మృతి" యను పద్యరత్నములను సాకల్యముగా, సావధానముగా పఠించినాను ఈగ్రంథము మొదటినుండియు చివరదాక ఆంధ్రుల ప్రజ్ఞావిశేషములను, ప్రతాప సాహస పరాక్రమములను, భక్తి జ్ఞాన వైరాగ్యభాగ్యములను, రాజ్య సామ్రాజ్యస్థాపన పరిపాలనా దక్షతను, వైభవ ప్రాభవములను స్మృతికి తెచ్చుచు ప్రతియాంధ్ర హృదయమును ఉత్సాహావేశపూరితము గావించి తొల్లింటి భోగ్య భాగ్య సంపాదనములకై దీక్షాబద్ధుల గావింపజాలి యాంధ్రుల భాగధేయమై యలరారుచున్నది

ఆంధ్రయువకు లిందలి పద్యరత్నములను పూర్ణముగా పఠించి యాంధ్రత్వ మలవరచుకొని ఆంధ్రరాష్ట్ర సిద్ధికై ప్రయత్నించి సఫలతనొంది చరితార్థత నందగలరు, ఈ గ్రంథరత్నము ప్రతి యాంధ్రుని యింటను రామాయణ, భారత, భాగవతములవలె పఠనీయమై యలరారవలయునని కోరుచున్నాను. ఆంధ్రరాష్ట్ర సిద్ధికిని ఆంధ్ర మహాభ్యుదయ పరంపరాభివృద్ధికిని ఆంధ్రయువకు లిట్టి ప్రబోధక గ్రంథములనేకము రచియించి తమ కవితను సార్థకపరుచుకొందురు గాక యని కోరుచున్నాను. ఆంధ్రపుత్రుల నిట్టి సదుద్యమమున పాల్గొన ననుగ్రహించి యాశీర్వదించి ఫలసిద్ధి నందించ జేయ భగవంతుని ప్రార్థించుచున్నాడను.

వీరికవిత మృదుమధురమై ధారాళమై, హృదయంగమమై యలరారుచున్నది. శ్రుతికటువులేని పదములు కాని, కర్కశజటిల పదసమాసములుగాని యీ కావ్యమునం దెందును గానరాక మొల్ల చెప్పినట్లు "తేనెసోక నోరు తీయనయగు రీతి" నర్థము తోడనే తోచుచు చదువరుల నుత్సాహపూరితులఁ జేయుజాలియున్నది. వీరికిది ప్రథమ ప్రయత్నమైనను, అరితేరిన చేయి యనిపించు పోకడ లనేకము లిందు గలవు. శ్రీ వేంకటరత్న శర్మగారి యీ గ్రంథము నభిమానించి ప్రోత్సహించెదరనియు నిట్టి గ్రంథరత్నము లీ రత్నకవిగారనేకము రచియించి తమ కవితను చరితార్థ పరుచుకొందురనియు నమ్ముచున్నాను.

ఇట్లు,
విన్నవించు విధేయుఁడు,
ము|| వేంకట శర్మ.
౭ ఆగస్టు ౧౯౪౪.

శ్రీ

# అభినందన మిత్రవాక్యము.

పిండినఁ దేనెలొల్కెడి కవిత్వము, చూచిన గ్రోలకుండు వా
డుండెర దెన్నఁడో యణగి యుండిన కమ్మని తెల్గువీర బ్ర
హ్మాండపటుత్వముల్ తిరిగి యాంధ్రులకంకిత మిచ్చినాఁడు నీ
గుండెవ్రపించినీరవవా! క్రొవ్విడి వేంకటరత్న సత్కవీ!

౧

ఒక్కొక్కచోట కై పెక్కుకమానరు
పాఠకోత్తములు సంబరముతోడ
ఒక్కొక్కఘట్ట మందుండు కమ్మనియాంధ్ర
తేజోతిశయము మూర్తీభవించి
ఒక్కొక్కచోనేటి బక్క చిక్కినగతి
గ్రుచ్చును మదుల ముల్కులవిధాన
ఒక్కొక్కపద్యమే యుక్కు గుండెలనైనఁ
గరగించి తీరు నెక్కరణినైన

ఏమితలపోసి వ్రాయ నూహించినావొ!
కలముబట్టిన ఘటికల చలువదేమొ!
భాసురగ్రంథ రచన కుపక్రమించి
పూర్తిగావించి ధన్యత బొందినావు.

అరయన్ మున్నొకనాఁడ నూనవిభవవ్యాపారతన్ కృష్ణభూ
వరుఖడ్గాంతరసీమలన్నిలచి ప్రాప్తంబైన కాలంబుచేన్
గరిమల్ గట్టియు మిణ్కుమిణ్కుమను సాతత్తు తెల్గు
సామ్రాజ్యపుం
బరువున్నిల్పడె! తావకీనకవితా వాల్లభ్య మాంధ్రిస్త్రుతిన్.

మలకపేట,
హైదరాబాదు
28–11–43.

ఇట్లు,
విధేయుఁడు,
మేడూరి ఉమామహేశ్వరం.

P. V. Sharma, M. A.
Officiating Principal,
Madrasa-i-Aizza.

243, Cement Block,
Malakpet.
Hyderabad [Dn].
D/ 2 nd May 1942.

I have seen 'The Andhra Smrithi', a series of Telugu poems on the greatness of the Andhra Genius in the sphere of arts, literature etc.

The object of the learned author Mr. K. V. R Sharma is to revive the ancient culture of this once-great nation, which ruled from the Penna to the Ganges by instilling among the younger generation such noble virtues as love for unity, patriotism and for all that Andhra Culture stands.

The poems are full of noble sentiments expressed in a style which is fervent, forcible and deep. It combines the proud old style of the poets of the nineties with the freedom and the national consciousness of the moderns.

I consider the present bunch of these sweet and melodious flowers will be a forerunner of more such poems from this erudite author's pen.

(Sd) *P. V. Sharma.*

# తొలిపలుకు.

ఓం!

యే నామ కేచిదిహ నః ప్రథయంత్యవజ్ఞామ్
జానంతి తే కిమపి తాన్ప్రతి నైష యత్నః
ఉత్పత్స్యతే మమ తు కోఽపి సమానధర్మా
కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ!

— భవభూతి. —

పరిదృశ్యమాన ప్రపంచరంగమునందు, సృష్ట్యాదినుండియు కవిత్వము మానవునికి సహజలక్షణముగా గానుపించెడిని. ఏలనన, మానవుని శైశవదశయందే వేదకాలపు నాటియార్యులు తొలిపలుకులగు ఋక్కులను గానముఁజేసిరి. ఆది కావ్యమగు రామాయణమును పాడి, "వాల్మీకి కోకిల" యమరత్వమును బొందెను. పంచమవేదం బనబడు "భారతామ్నాయమును" రచియించి వ్యాసమహర్షి భగవానుఁడయ్యె.

కవిత్వమనునది యొకరిసొత్తుకాదు; పాత్రికులాడిన రానేరదు; బహుజన్మ తపఃఫలము; పూర్వసుకృత సంచయము; వరప్రసాదలబ్ధము. లోకములో కవిత్వ మబ్బుట చాలాదుర్లభము, అందువలననే మనపూర్వులు:—

"శక్తిర్నిపుణతాలోకశాస్త్రకావ్యాద్యవేక్షణం
కావ్యజ్ఞశిక్షయాఽభ్యాస ఇతిహేతుస్తదుద్భవే"

అని కవిత్వ మబ్బుట కిన్ని లక్షణము లుండవలె నని నుడివియున్నారు. "Poets are born and not made" అన్న నుడువు సత్యము కవిత్వమును చెప్పువా రందరు కవులనిపించుకొనరు. కవిత్వము ముఖ్యముగా రసాశ్రయము. రస పిపాసాజిఘృక్షువులకు ముముక్షువులకు గాని సామాన్యులకు కవిత్వగుణ మగోచరము. కవియున్నచో నిరంకుశుఁడు; రా రాజుకన్న మిన్న యగు మేటి మానిసి; రవి గాననిచో కవి గాంచును.

ప్రకృతియొక్క మూలమూలలనుండు సమస్త స్థూల, సూక్ష్మ జగము, స్థావర ప్రదేశములన్నియు నన్వేషించును. ప్రకృతి దేవతోపాసకుఁడు కవి; ప్రకృతియొక్క గాఢభక్తుఁడు; కవియే ప్రకృతి; ప్రకృతియే కవి. ఏది యెట్లున్నను, ఒక విధమైన ఆవేశము, హృదయాకర్షణము లేనిదే పద్యము రక్తి కట్టదు. రక్తి కట్టినను చిరకాలము నిలువ నేరదు. ప్రకృత కాలములో కవికుమారులు పెక్కురు. ఏ ఫక్కి కానిండు. పై రెండు గుణములను మనస్సులో నుంచుకొనియే తమ రచనలకు గడంగుచున్నారనుటకు సందియము లేదు. ఇదియెంతయు, నవ్యసాహిత్యచరిత్రలో భావి పురోభివృద్ధి కెంతయును శుభదాయకము.

నేను సాహితీరంగములోఁ గజ్జెఁ గట్టుట కిదియే ప్రథమమని చెప్పవలయును. నాకు "ఆంధ్ర భాషా" పరిచయ ము కొలది; ఏదియో విద్యార్థిదశలో, స్కూలులో నేర్చుకొన్నదియు, తదుపరి మిత్రులసన్నివేశమున అలవడిన సాహిత్య జ్ఞానముఁ దప్ప తిరిగి యింతవరకు తెలుఁగు భాషలో కృషిఁ జేయుటకు

కారణాంతరములవలన నావకాశము కలుగలేదు. నావిద్యార్థి దశలో నా మిత్రులు మ॥ రా॥ శ్రీ. గోపరాజు వేంకటాచలపతిరావు, (మోరి, రాజోలు తాలూకా, తూర్పు గోదావరి జిల్లా) కీర్తిశేషులయిన మద్దిపట్ల వేంకటరమణయ్యగార్ల సంసర్గమువలన కొంత భాషాపరిచయ మేర్పడి కవిత్వమల్లుటకు ప్రారంభకాలము; అనగా, 19 5 సం॥ర ప్రాంతము.

ఆస్వర్ణదినము లింకను మరపునకురావు.

తదుపరి 1919—10—22 తేదీని, గ్రంథాలయ సర్వస్వములోను, కృష్ణాపత్రిక మొదలగు సుప్రసిద్ధ పత్రికలలోను, ఈగ్రంథములోని పూర్వభాగములో వివరించిన గీతములు-పోగా, మిగిలినవి-కొన్ని ప్రకటించినాను. నాటినుండి నేటివరకును, భాషాభిమానము, ఉత్సాహము విశేషముగనున్నను నేనేమియు రచించుటకు సాహసించలేదు. నా లేఖిని కఠోరతమమగు నజ్ఞాతవాస దీక్షను కారణాంతరముల వలన వలంబించవలశి వచ్చినది. ఇప్పుడైనను, నా పురోభివృద్ధిఁ గోరు పలువురుమిత్రుల ప్రోత్సాహమువలననే ఈగ్రంథమును ప్రచురించుటకు సాహసించుచున్నాడను. ఇందులకీ గ్రంథమందలి "పరిచయవాక్యములే" సాక్ష్యము-గనుక, భాషావిప్లవములు పెక్కులు చెలరేగి భూనభోంతరాళములు కావ్యవిమర్శక దుమారముచే రోదసీగహ్వరము లంధకారబంధురమగు నీదినములలోఁ దార్కికులెవ్వరుగాని, "అప్పకవులు"గాని, వైయాకరణులుగాని నాజోలికిరారనియే నమ్మకము.

కవికిని, విమర్శకునకు నెప్పుడును చుక్కెదురే! సుకవి కవిత్వము తార్కికదృష్టితోఁజూడ విమర్శకుల తీవ్రకోపా

నలజ్వాలల కాఁగ నేరదు. అందువలననే, "పిల్లవసుచరిత్ర" అను ఖ్యాతిని గాంచిన "విజయవిలాస" గ్రంథకర్త, చేమకూర వేంకటపతి.

("ఏ 1 గతి రచియించినేని సమకాలమువారలు మెచ్చరే గదా" అని, ఒక్కసారి నిట్టూర్పువిడచి యూరకున్నాఁడు)

ఏదియెట్లున్నను, ఒక గ్రంథములోని గుణదోషములను లెక్కించుటకు కాలముకంటె నెక్కువవిమర్శకుఁడుండబోఁడు.

"The test of Greatness is the page of history" అని, Goldsmith కవి వ్రాసినదెంతయు ముమ్మాటికిని సత్యము. ఏ గ్రంథమునందైనను, గుణమే లేనిచో పునర్ముద్రణమునకే యవకాశముండదు. విమర్శకుల కిదియే నా సమాధానము.

భాషా విషయములో నొక్కమాట. ఇందలి యతిప్రాసలు, సంధి, విసంధులు. ప్రయోగములు మొదలగువానిలో, పూర్వకవుల పోకడల ననుసరించుచువచ్చినను, కొన్నిచోట్ల స్వాతంత్ర్యముఁ దీసుకొనుచు ఆధునికులలో ప్రఖ్యాత కవిరాజులను మార్గదర్శకులుగాఁ గైకొంటిని. మరికొన్ని తావులలో, రసము, ఆవేశమే ప్రాధాన్యముగాఁగొంటిని. ఈ సంధ్యాకాలములో, ఈ ప్రళయబాంబు నిర్మాణకాలములో నింతకంటె శరణ్యము లేదు. దీనినే ఆంగ్లమున "Old wine in new bottles" అని పేర్కొందురు.

ఇతివృత్తము పాఠకులకు సువిదితము. నష్టమైనఆంధ్రప్రతిభను పునరుద్ధరించుటయే. దీనికి, చిరకాలము నతలయెత్తిన "ఆంధ్రోద్యమ" బీజము, మహావృక్షమగువరకు సంతత దో

హదమొందర్చుట, ఆంధ్రదేశపుం గాలిపిల్చిన ప్రతియాంధ్రున కును ముఖ్యకర్తవ్యము.

మరొక్కమనవి. కాలక్రమానుగతముగా, ప్రకృతి యందనేకమార్పులు నైసర్గికములు- కాలచక్రము నరికట్టుట కేరికినసాధ్యము. సామ్రాజ్యములంతరించవచ్చును. ఖండాంత రములు కాలగర్భములోం దాగవచ్చును. నాగరికతలు నశింప వచ్చును. నూతనఖండములు భూగర్భమునుండి తిరిగి ఆవిర్భ వింపవచ్చును. నాగరికతాపరిపుల్లమగు మేటిసంస్థలు పరపీడ నకుగురియయి చెప్పరాని వేదనల ననుభవించవచ్చును. గాని సాధ్యమయినంతవరకు నేజాతియు తననాగరికతనుగాని, విజ్ఞా నమునుగాని మహావిప్లవము లెన్నివచ్చినను సంరక్షించుకొని భద్రపరచుకొనుట మిక్కిలివివేకమైనపని. ఇదియే నా సందే శము.

మరియు, నీగ్రంథమును సాంతముగా సమీక్షంజేసి, స్ఖాలిత్యములున్నచోటుల సవరణలంజూపిన మిత్రులు బ్ర॥ శ్రీ॥ కురుగంటి సీతారామయ్య M. A. గారికిని, బ్ర॥ శ్రీ॥ బిదురు శేషయ్య B. A. గారికిని వందన సహస్రము లర్పించు చున్నాడను. ఇందలి పద్యముల పెక్కింటిని పలు సంస్థలలో హృదయంగముగా గానముంజేసిన సంగీత విద్వాన్ పులపర్తి రామదీక్షితులగారికి నా కృతజ్ఞతలు.

ఇట్లు

కొప్పర్తి వేంకటరత్న శర్మ. B. A.

విద్యానిధి, ఉభయభాషా ప్రవీణ,

## H. రాధాకృష్ణమూర్తి P. O. L.

ఆంధ్రభాషాధ్యాపకుఁడు

ఆంధ్రవిద్యాభివర్ధనీ ఉన్నత పాఠశాల, ఓరుగల్లు.

శ్రీ వేంకటరత్నశర్మగారు రచించిన "ఆంధ్రస్మృతి" యను ప్రబోధ కావ్యముఁ జదివితిని. కావ్యమందంతట ఆవేశ పూరితమగు చక్కని కవిత చిప్పిలుచున్నది. ఆంధ్రుల నేటి దైన్యస్థితియే వీరి యీ కవితకాలంబన మగునట్లు కానబడుచున్నది. వీ రాంగ్ల భాషా పట్టభద్రు లగుటచేత నాభాషాచ్ఛాయ లే గ్రంథమందెల్లెడల గన్పట్టుచున్నవి. నేఁటి రసపిపాసువుల కాటంకప్రాయములగు పూర్వకవి శృంఖలములఁ గొంతవరకు సడలించుకొనుట వీరి గ్రంథమందలి విశేషము. వీరు తమ కవితనుగూర్చి చెప్పికొన్న "చుంచుంబాలమదీయ భవ్యకవితా శుభ్రాంగి" యను పద్యము వీరి వినయమును దెలియఁజేయుచున్నది. నిద్రాణమైనజాతిని ప్రబోధించుటకిట్టి గ్రంథము లావశ్యకములు. వీరీ గ్రంథమునకు "ప్రథమోల్లాసము" ని పేరిడుటచే నింకను కొన్ని యుల్లాసములుగల గ్రంథము కలదని ద్యోతకమగుచున్నది. వీరీ గ్రంథమునంతయుఁ బ్రకటించి యాంధ్రుల సేవించు నదృష్టము సహృదయులు కలుగఁ జేయుదురుగాక! కవిపండితలోకమీ కావ్యకన్యకను జల్లని చూపులతో నాదరించునుగాక! ఆంధ్రభాషా సతి కిది యొకభూషణమై తనరుగాక!

హరి రాధాకృష్ణమూర్తి.

25 - 12 - 46

# పండితాభిప్రాయము.

శ్రీ కొవ్విడి వెంకటరత్నశర్మ బి. ఎ. గారు రచించిన "ఆంధ్రస్మృతి" యను కావ్యమును సమగ్రముగాఁ జదివితిని. ఇది యేవారి తొలికృతి. అయినను ముద్దులొలుకు పలుకులతో, భావగాంభీర్యము గలిగి, ప్రత్యణువునను నాంధ్రత్వము దీపింప, నుత్తుంగోద్రేక భావతరంగ సంఘములతో, సహజ కవితా ధోరణిలో నడచిన దీకావ్య స్రవంతి.

సీసముల పోకడకు, ఆంధ్రాభిమానమునకు, శ్రీనాథుని, శ్రీ రాయప్రోలు సుబ్బరాయభట్టాచార్యులను దలపింపఁ జేయుచు హృదయంగమముగా నున్నది.

స్వరాజ్య సంపాదనకు సర్వస్వంబును ధారవోసిన శ్రీ ఆంధ్రకేసరిని వర్ణించుపట్ల రచించిన "సతికిం జెప్పఁడు, సోదరావళిని వీసంబైనఁ బేర్కొఁడ" ను పద్యరత్నంబులాణిముత్యంబుల వలె రాణించుచు నమందానందమును గొల్పుచున్నవి.

శ్రీ వేంకటరత్న కవిరత్నముగారిట్టి కావ్యరత్నములను బెక్కింటిని వెలార్చి ఆంధ్రమాత కమూల్యాలంకారముల నర్పించి యర్చింతురని యాశించుచు నింతటితో విరమించుచున్నాను.

ఇట్లు,

Telugu Pundit,
Methodist Boys'
Highschool
Hyderabad. 1-1-47

విద్వాన్, కవిచంద్ర,
వేండీపల్లి లక్ష్మీకాంతం.

శ్రీ

# ఆంధ్రస్మృతి.

(తెలుఁగు వీధులు)

## తారణ.

౧

ధారుణి తరణోపాయపు
కారణమూహింపలేక కళవళపడఁగన్
మారణ యంత్రంబులకరి
తారణ యేతెంచె, మోద దాయకమగుచున్.

౨

సంధ్యావనిజపుష్ప సౌరభానీలముల
తేలియాడు భ్రమర బాలికలును
నునుపల్లవంబుల నోర్వట్టి భక్షించి
పలవించు గండు కోయిలలపిండు
చలువపందిళ్ల వైశాఖ పూజలనంది
సామగానము పాడు భూమిసురలు
నవవనోన్మేష యున్మత్త రసావనమున
పరుగిడు నూత్న దంపతులజతలు.

కలరుతోడని విఱ్ఱ వీగకు వసంత!
చావో? బ్రతుకో? తేలెడి పెనుసంధియుగము
ప్రళయపర్జన్య గర్జలు ప్రబలెనింగి
తారణునితోడ పూను ముద్ధరణ మవని.

3

ఆదిసంధ్యాసమయంబు, హేమనయముల్, హిట్లర్లు, ముసోలినీ
మొదలౌ చండప్రచండపుణ్యజనమెప్డున్ భూమినట్టాడు దు
ర్మదమష్టాలపు సంగమంబు; పృథుసామ్రాజ్యంబు లల్లాడనీ
మదికింకెక్కటి శాంతి? శీఘ్రగతిసమ్మార్జింపుము దేహులన్.

౪

కూడుంగుడ్డయు లేని పేదజను లెగ్గుల్ పెక్కులొందంగఁ దా
క్రీడారంగముగాఁ దలంచి శివకేళిన్ దాండవంబాడె నీ
జోడైనట్టి 'స్వభాను' సోదరుఁడు; సంక్షోభించె చక్రాళి, యా
పాడుం బోకడ చెంతఁ బోకఁగను మీపై విశ్వకళ్యాణముల్.

౫

మంగళవేదఘోష, సుమమారుతముల్ వెలయింపగా రసా
భ్యంగనముబ్బు వేళ, దధిపాయసముల్ విరియించి సత్కళా
రంగములందు సృష్టియెడరన్ గడు శాంతియు, తుష్టి, పుష్టి వే
భంగులనిత్యశోభనము, పచ్చనితోరణమందు తారణా!

౬

చివురులుమోసులెత్తవనశిల్పపుకెందలబ్రాలుశ్శోభ క్రొం
జవులనుచిల్కరింప, సురసాధ్వులు నృత్యముసందడించి, స
త్కవులనుమేళవించి సుధధామమునాయెల మావిగున్నపై
కువకువరాగవల్లరుల కో! యనుపల్లవి పాడుతారణా!



## ప్రాచేతసుండు

తొలిపల్కుల్ గనరాని దివ్యమహిమన్ దూగాడుచున్నట్టి నిదు
ర్భలనిస్వనోద్భవమైన క్రౌంచమిథున వ్యాపార వ్యాఖ్యాతయై
విలసిల్లెన్ వెసనాదికావ్య రచనావిఖ్యాతి, నా సంయమిన్
దలతున్ నామది వామలూరుతనయున్ వాల్మీకి నశ్రాంతమున్.

# ప్రణామము.

## ౧

కమనీయకల్హార కాసారకలితంబు
నందనారామ సుందరతరంబు
పుణ్యానదీతోయ పూతవిఖ్యాతంబు
దక్షవిధాతృ సద్ధర్మపథము
శుద్ధసాత్త్విక తపోవృద్ధ విలసితంబు
గౌతమసంయమి కేతనంబు
వజ్రవైడూర్య సంభరిత సామ్రాజ్యంబు
కోహినూరు కోటీర విహారణంబు

సిద్ధనాగార్జునాద్రి ప్రసిద్ధసీమ
ఆంధ్రసీమంతినులకు దివ్యార్ఘ్యపేటి
అర్ధచంద్రుని తెలితేట నవఘళించు
నట్టికమ్మని మనభూమి కంజలిడుము.

## ఆంధ్ర స్తుతి.

### ౨

శ్రీమన్మహారాజ సేవితాంఘ్రి సరోజ
సిరులకు కాణాచి సిద్ధహస్త
జైన, బౌద్ధాద్వైత, శాక్తేయ, చార్వాక
శైవాదిషణ్మత స్థాపనోర్వి
కపిల, మార్కండేయ, గౌతమ, నిట్టల
పరివ్రాజకమహా తపఃఫలంబు
మాంధాతృ, బలి, కర్ణ మహితకుంజరయూథ
దానధారాపాత ధన్యకీర్తి

పున్నెముల పేటి, దక్షుని జన్నవాటి
శిల్పముల మేటి, వరహాల చిన్నికోటి
భారతాంబకు మురిపాలఁ గేరుఁబోటి
తెలుఁగుతల్లీ! నమస్కారము లివెగొనుము.

# ప్రశస్తి

ఆదికాలమునుండి యవన, బాహ్లిక ధాటి
నరికట్టె నీపురా నాంధ్రజాతి
పాలపాశములిచ్చి పాలించి బౌద్ధంబు
నన్యభూములకిచ్చె నాంధ్రజాతి
తన శేముషీ దురంధరత సంరక్షించె
నార్యధర్మముఁ దొల్లి నాంధ్రజాతి
ఆర్వీటి, కాకతి, దోర్వీర సాళ్వ, తు
ళ్వాన్వయంబులఁ గన్న దాంధ్రజాతి

భారతమ్మకు ముత్యాల పట్టుగొడుగు
ప్రళయనటరాజు జటనాడు నెలవెలుంగు
సిద్ధనాగార్జునిం గన్న చిరవిభూతి
అమృతసిద్ధిని గన్నదీ "ఆంధ్రజాతి".

# గాంధి.

ఎవ్వాఁడునవ్విన నివ్వసుంధర యెల్ల
చంద్రికాప్లుతమయి చలువలీను
ఎవ్వానిక్రోధాగ్ని కేడువారాసులు
పాయలై భూమిఁ గర్భమున నింకు
ఎవ్వాఁడునిద్రింప నీక్షోణిమర్త్యాళి
ప్రళయకాలపుభంగి కళవళించు
ఎవనిసిద్ధాంతముల్ హృద్యానవద్యంబు,
లాచంద్రతారార్కమై వెలుంగు

ఎవ్వఁడభినవ బుద్ధుఁడై నివ్వటిల్లి
విమలసత్యాగ్రహవ్రతంబు వెలయఁజేసి
మానవాళికి నొరవడై మనుచునుండె
నట్టిగాంధిని స్మరియింపు మాంధ్రనీవు.

# ప్రబోధము.

౧

వల్లభాచార్యుఁడే తల్లి స్తన్యముఁ ద్రావి
జైత్రరాహులప్రేమఁ గుత్తుకఁ గొనియె
పండితరాయలే పయిడి గర్భము పండ
మొగలు సమ్రాట్టుల మ్రొక్కులందె
గీర్వాణవాఙ్మయ క్షీరాబ్ధి మథియించి,
భవభూతి యెచ్చోటఁ బంచెసుధను
భారతాంబకు ధర్మసారంబు నొరవడిఁ
గఱపె నాపస్తంబ గురుఁడదెచట
అల యుగంధర తిమ్మరు సయ్యలాది
సచివులభినవ చాణక్యులెచటఁబుట్టి
మహిమ నెలరించిరే జగన్మాన్య తెలుఁగు
తల్లి నొకసారి మనసారఁ దలచుమాంధ్ర.

౨

ప్రాబల్కులనుదిద్ది భాష్యంబు లిఖియించె
సాయణాచార్యుఁడే జనని ఫలము
వేదధేనువుఁబిండి విరజిమ్మెఁ జంద్రికల్
మంత్రి విద్యారణ్య మాధవుండు
ఆ భాష్యపర్యంత మా వేద సుధఁగ్రోలి
బసవఁడెచ్చోట శైవంబుఁ గఱపె

ప్రాకృత భాషాప్రవాహంబు నరికట్టె,*
హాలుఁడేచోట 'గాథాలహరుల'
ప్రథిత కర్ణాటభాషకు రచన నేర్పి
సొంపు లెలయించె కవిరాజు పంపఁడెచట
ఉపనిషన్మధువానిరి తపసులెచట
తల్లి నొకసారి మనసారఁ దలచుమాంధ్ర.

3

రఘునాథభూపుఁడే ప్రాంత మందునఁ బుట్టి
గోష్ఠీరసములఁ గ్రోలెఁదొల్లి
ఖండనసీమ నుద్దండ మార్తాండుఁడో
ఘన ప్రతాపునకేది కాపురంబు
నరసింగకృష్ణ నానాచమూ ధాటి
తీండ్రించి వెచ్చలఁ దేర్చెనెచట
బొబ్బిలి బెబ్బులుల్ బొబ్బరింతలు మించి
ఖండాంతర ఖ్యాతిఁ గాంచె నెచట
కరగలేదు కాకతినేత్రు కరుడులెచట
ఆరలేదింక నాంధ్ర శౌర్యాగ్ని యెచట
అట్టి వీరమాతను భువనైక నుతను
తల్లి నొకసారి మనసారఁ దలచుమాంధ్ర.

* అరికట్టు = పరివేష్టించు

ఆంధ్రి స్తుతి.

౪

కటక వింధ్యాచలత్మోతలంబే తల్లి
చలువచే మున్ను వెన్నెలలఁ గాసె
'మోటుపల్లి'యు రేవు కోటిసూర్యులతోడ
ఏయమ్మ జెండాల నినుమడించె
అవచితిప్పయ శెట్టి నవరసుల్ 'రోమున'
ఏ రామ మహిమంబు మారుమ్రోసె
ఏ దేవి ప్రేమప్రసాదంబు కోట్లేటి
పాఁసస్యంబుల పాలవెల్లి
సురభిమల్లెల, మొల్లల పరిఢవిల్లి
కనకశాఖల విలసిల్లు కల్పవల్లి
అందములఁజల్లి, రతనాలఁ జిందెతొల్లి
తల్లినొకసారి మనసారఁ దలచుమాంధ్ర.

౫

విస్తరించెనురాగ, ప్రస్తారముల సరుల్
రామయమంత్రి కర్ణాట శక్తి
దాక్షిణాత్యులనూచెఁ దన్మయత్వపుఁదోల
లమృతసూక్తుల భక్త త్యాగరాజు
ఖండశర్కరబోలుఁ గమనీయపదములఁ
గుప్పించె క్షేత్రయకోవిదుండు

భారతాబ్ధిగలంచె, భావతరంగసం
దీప్తనారాయణ తీర్థలహరి
గండూషమొనరించె గానసాహితికళల్
తాళ్లపాకబుధులు క్రేళ్లువారి
రాగరసభావతాళముల్ రక్తిలీన
కూచిపూడి సత్యాదేవి కూర్మిలోనఁగ
విమలగాంధర్వ వీధుల విందులందు
తల్లినొకసారి మనసారఁ దలచుమాంధ్రి.

౬

దక్షిణోత్తర సాంప్రదాయంబులనుఁ గల్పె
శార్ఙ్గదేవుఁడు తొల్లి సారమతిని
శృతులను సృజియించి సూరి లోకము మెచ్చ
స్వరకల్పనమున హాబాలుఁడుఁ జేసె
జనకజన్యసు రాగచారు రీతులఁ దెల్పి
సోమనార్యుఁడు మహాశోభఁగాంచె.
సమ్మోహనముఁ జేసె జతియించి మొగలు, పా
ర్సీకరీతుల పుండరీకవిఠలుఁ
డింకనిర్మించె రాగముల్ వేంకటమఖి
ప్రథితకవినాథ, సారంగ పాణిగాగ
మేటివాగ్గేయకారకుల్ మేల్మిఁగనిన
తల్లినొకసారి మనసారఁ దలచుమాంధ్ర.

౮

పుల్కరించదె మేనుఁ! గల్కి రుద్రమ దేవి
వీరకృత్యంబులఁ దీరుగఁగన
రేకెత్తదే గుండె! రిపులమర్దించిన
బాలనాగమ్మ చందాలఁగనిన
కొల్లలాడించదే! ఘోరారిబీరంబు
మల్లాంబ చైదముల్ కల్లగావు
అమ్మక చెల్లరో! సొమ్మసిలం జేసె
బ్రహ్మనాయని పోరఁబడతినాగ
కార్యనిర్వాహంబు గావించదే శక్తిఁ!
పతియాజ్ఞ గణపాంబ ప్రబలఁజేయు
పతికి కరవాలమిచ్చిన సతియొక తె
ప్రాణవిభునకు పసుపిచ్చి పంచెనొక తె
అట్టిమాంచాల, ఖడ్గ తిక్కన్న సతుల
వీరమాతలగన్నట్టి సారమతిని
తల్లినొకసారి మనసారఁ దలచుమాంధ్ర.

౯

ముత్తెముల్ రాలవే! ముద్దుపళనినోట
శృంగారవీథుల రంగవల్లి
మొల్లమల్లియతీవె తెల్లనిమొగ్గలు
చాటవేసితమ్మ సాంద్రకీర్తి

# ఆంధ్ర స్మృతి.

తనియరే వేల్పులు తరిగొండ వెంకాంబ
జ్ఞానవైరాగ్య రత్నములఁ గురియు
భరతోర్వి సుధలొల్క భారతికంపించె
మనరామ కథవల్క మధురవాణి
శతలేఖినీ ఘ్రాడి, సమయలేఖారూఢి
రఘునాథుఁ గీర్తించె రామభద్రి
మోహనాంగి, రంగాజమ్మ ముద్దులొల్క
తాళ్క-సీతమ్మ ధర్మముల్ డోలలూగ
పరమసాధ్వుల గన్నట్టి భాగ్యవతిని
తల్లినొకసారి మనసారఁ దలచుమాంధ్ర.

౯

కాళిదాసుఁడు తిర్గి కాళికి మ్రొక్కడా!
తిక్కన్న నుడిసొంపు దీప్తిఁ గనిన
సిట్టనాదికవులు చిట్టిలఁగొట్టరా!
పోతన్న శబ్దార్థ రీతిఁ గాంచి
ఆనాటి హర్షుండు పోనాడడాదివి!
శ్రీనాథ నైషధ వాణివినిన
శీత శైలేంద్రుని శిలలు ద్రవింపవా!
పెద్దన్న కవనంపు సుద్దులంది
పింగళిసూరన్న పృథుభావ గరిమను
తలలొగ్గి మ్రొక్కరా! దండికవులు

## ఆంధ్రి స్మృతి.

బంకిచంద్రర మీశుల బాసలేల?
వంగసారస్వతంబె నీహాంగులటర!
అలరవీంద్రుఁబోలు కవులు గలరు మనకు
కల్లగాదు విమర్శించి గనుచునీదు
తల్లినొకసారి మనసారఁ దలచుమాంధ్ర.

౧౦

సిద్ధుఁడై, బుద్ధుఁడై సృజియించె ధాతువై
ద్యంబెలధాత నాగార్జునుండు
భిక్షువై, చక్షువై వెజ్జులోకమునిల్చె
సవనాథసిద్ధుఁడు నవ్యక్రియల
సూరియై, ధీరుఁడై భూరిరేఖలఁబర్వ
చంద్రదీప్తినొసంగె నింద్రగంటి
వెలయించె నిఖిలోర్వి విశ్వతోముఖదీప్తి
వైద్యభాస్కర ప్రౌఢ బసవరాజు

గజపతీంద్రుఁడు కృష్ణరాట్ ప్రాంతలేందుఁ
జెవనిముత్తాతకిచ్చె నీయవని, బిరుద
మిట్టిబుఘనరాము సను పేర నామ్యఁగన్న
తల్లినొకసారి మనసారఁ దలచుమాంధ్ర.

౧౧

గొల్లలాడింపఁడా! గోపాలసింహమున్
చాఁఖాఁకుఁడాఁధూళిల త్రాణఁజూపి
వెలయఁడే! విఖ్యాతి విశ్వరూపముఁ జూపి
భీమసేనుఁడు కోడి రామమూర్తి
పులిలోటఁబాపి తా త్రయుగముఁ జూపఁడా!
మేటివీరుఁడు కోడేటిరాజు
శస్త్రాస్త్రవిద్యల సవ్యసాచినిఁ ద్రోసి
ఖ్యాతిఁగాంచె 'కలియుగార్జునుం'డు
భూరితేజుఁడు, ఘనఘుండు, భూసురుండు
త్రాణనొప్పారు నభినవ ద్రోణుఁడనఁగ
బులుసు రామజోగిసిఁగన్న కలుషహారను
తల్లినొకసారి మనసారఁ దలచుమాంధ్ర.

౧౨

బొబ్బిలికథలోను, గొబ్బిసంక్రాంతిలో
భూరిపుష్కరవారి పూరములను
భరతనాట్యములోన, 'బాగోతకత' లోన
శ్రీనాథకవిరాజు సీసములను
"ఎంకిపాటల"లోను, వేంకటశాస్త్రి సు
ధామధురోక్త్యవధానములను

జంగమ పాటలో, 'శంభో' పదంబులో
కాంభోజరాణ్మౌళి గాథలందు
పుణ్యగోదావరీ, కృష్ణ వేణ్యఖండ
తుంగభద్రా, పినాకినీ భంగములను
జిందులంద్రొక్కి, త్రుళ్లింత లొందు తెలుఁగు
తల్లి నొకసారి మనసారఁ దలఁచుమాంధ్ర.

౧3

పలనాటిసీమలో, పాకాల చెరువులో
బాలనాగమసాధ్వి పదములందు
మాంచాల చేతలో, మల్లాంబ పలుకులో
ఖడ్గతిక్కనకత్తి కాకలందు
నెల్లూరిపురి, వేంగిపల్లె వీధులయందు
కవితిక్కనామాత్య ఘంటమందు
దిరుమల క్షేత్రంపు దివ్యతీర్థములందు
సింహాచలపుకొండ సిగలయందు
ముద్దుగోపాల దేవుని ముత్తెములను
ఘనుఁడు పోతన కావ్యంపుఁ గళలనిండి
తొంటి శారదకాటుక కంటవెలుఁగు
తల్లి నొకసారి మనసారఁ దలఁచుమాంధ్ర.

౧౪

చంద్రగుప్తుని భుజాస్కంధ మెక్కినప్రౌఢ
    చాణక్యుఁ డాంధ్రుల ప్రాణమనుము
మన్మసిద్ధినృపాల మంత్రి తిక్కనకవి
    తెలుఁగులబహు తపఃఫలమె యనుము
హైదరాలీ, టిప్పులాస్థాన ప్రెగ్గడ
    పూర్ణయ్య యాంధ్రుల పుణ్యమనుము
గోల్కొండ తానీషకొలువు నుద్ధతిఁగన్న
    అక్కన్న, మాదన్న లాంధ్రులనుము
నేడు కర్ణాటగద్దె నిర్నిద్రకీర్తి
న్యాయపతి మాధవామాత్యుఁ డాంధ్రుఁడనుము
బీఱువో లేదు మనమాత భూరిగర్భ
మెందరెందఱో సచివులఁ బొందగలదు
తల్లినొకసారి మనసారఁ దలఁచుమాంధ్ర.

౧౫

ఏకల్యాణిపయోధరామృతము, మున్నీ గౌతమీకృష్ణవే
ణీకాల్లేటిస్రవంతులై విరియు. మున్నే ధాత్రి కేదారముల్
శ్రీకల్యాణకిరీటమై, విజయలక్ష్మీవాస నిక్షేపమై
వీకన్ శ్యామల సస్యశోభితములై వెల్గన్ ద్రయఃకోటిసే
వాకీర్ణ ప్రకటాంధ్రపాద కమలోద్యానంబుఁ గీర్తింపుమా.

# తెలుఁగువాఁడు.

౧

శిల్పలావణ్యంబు సిరిగ్రుమ్మరింపంగ
　　శిలలనుపొలిపించెఁ దెలుఁగుశిల్పి
కబ్బంపువిన్నాణ ముబ్బింపనుడి, జుంటి
　　తేనియలొలికించె దెలుఁగుసుకవి
కదనరంగంబుల క్షాత్రతేజముగ్రక్క
　　బలదర్పములఁజూపెఁ దెలుఁగుజోదు
భక్తివైరాగ్యముల్ ప్రభవింపఁ గురిపించె
　　దెసలభాష్యప్రసుధల్ తెలుఁగువేత్త
తర్కమీమాంస, సాంఖ్యముల్ తరచినాడు
తత్త్వశాస్త్రరహస్యముల్ తడవినాడు
బ్రహ్మవిద్యను జగతిలోఁ బంచినాడు
లలితమర్యాదగలవాఁడు తెలుఁగువాఁడు.

౨

తాతకన్పడినంత తనకరీంద్రముఁ డిగ్గి
　　కేలూతయొసఁగెనా కృష్ణవిభుఁడు
పచ్చలహారంబు పైనుంచి మెప్పించె
　　మనభట్టుకవికి తిమ్మరుసునతాళి
గ్రామనిర్మాణంబుఁ గావించెనిరుపమ
　　ప్రాకారములతోడ భాస్కరుండు

నిరతాన్నదానంబు నెఱపి పేర్మ్రోసెనా
సేతుశీతనగంబు సింగరాజు
విశ్వవిద్యాలయఖ్యాతి వెలసినాడు
సప్తసంతానములనిల్పె సచివుఁడొకఁడు
పదునువిూసంబు నర్థికై వదిలెనొకఁడు
తీరుతీయముగలవాఁడు తెలుఁగువాఁడు.

3

దీనారటంకాలఁ దీర్థంబులాడించె
కొలువుకూటములందు తెలుఁగురాజు
కమనీయమణిమయ కలధౌత హారముల్
దీనులకిప్పించెఁ దెలుఁగుప్రెగడ
రోము, చైనా, జావ సీమ దీవులసల్పె
ధీరవ్యాపారముల్ తెలుఁగుచేరి
ప్రకృతిశోభ వెలార్పఁ బండించె పంట బం
గారంబు లీ తెలింగాణ కాపు
ప్రబలసామ్రాజ్యలక్ష్మిఁ జేబట్టినాడు
హేమపాత్రల మృష్టాన్న మిచ్చినాడు
భోగభాగ్యములను తులఁదూఁగినాడు
కలిమిఁ బ్రతికి చెడినవాడు తెలుఁగువాఁడు.

ఆంధ్ర స్తుతి.

౪

ఉత్కలాశాని తంబోర్ధ్వ భాగంబుల
మిగుల నెయ్యముతోడ మెలఁగినాడు
మధ్యరాష్ట్రమునందు మధ్యాహ్నసూర్యుఁడై
దానధారాప్రభఁ దనరినాడు
కర్ణాట బేసులఁ గలిసిసంవాసించి
కావ్యరీతుల నెల్లఁ గఱపినాడు
ద్రవిడభూముల కేగి తమిళపాటనుదిద్ది
సంగీతసుధ వెదఁ జల్లినాడు
తొలుతనుండియు "లా" కేత్వములును, "దా" వు
కొమ్ములుంచక, స్నేహంబె కొసరినాడు
తెలివి తేటలతోడ నల్దిక్కులందు
తేజరిల్లినవాఁడు మా తెలుఁగు వాఁడు.

౫

సూత్రయుగమునుండి క్షాత్రపులందోలి
భరతఖండమును గాపాడినాడు
శాలివాహననామ శకమును స్థాపించి
విశ్వవిఖ్యాతిచే వెలిఁగినాడు
సత్యాగ్రహోద్యమ సమరగుండమునందు
చిచ్చరపిడుగట్లఁ జొచ్చినాడు

చీరాలపేరాల క్షేత్రరంగములందు
స్వాతంత్ర్య సమరముల్ సలిపినాడు
చిరమహోజ్వల యశమునఁ జెలఁగినాడు
మంత్రిపదవులతో మహిఁ బరగినాడు
బానిసతనంబు భరియింప లేనివాడు
ఇల పదమ్ములొత్తనివాడు తెలుఁగువాఁడు

౬

గజపతులంగన్న గంజాము మండలం
బొఢ్ఢవారలఁ జేర్చి యొగ్గినాడు
రత్నముల్ మొలచిన రాయలసీమను
దమిళులకర్పించి తనిసినాడు
పోతన, సోమనల్ పుట్టిన పుణ్యోర్వి
పెరభూపతులకిచ్చి మరచినాడు
వడికృష్ణ వేణమ్మ కడుపుపంటనుభూమి
భాగమున ద్రైసల్ పంచినాడు
ప్రథితనాగార్జునాద్రి శిల్పఁబులెన్నొ
కాలవాహినిఁ గలియంగఁ గాంచినాడు
తనకుమాలిన ధర్మంబు దనిపినాడు
కలుషమెరుగఁడు జగతి మా తెలుఁగువాఁడు.

౮

కవులను పోషించె గ్రాసవాసములిచ్చె
చవులూరు భక్ష్యభోజ్యంబు లిడియె
పల్లకిఁ దా మోసె వాణికిఁ బోయడై
పండితాళికి సదా ప్రాంజలిడియె
రత్ననీరాజన రత్నాంబరములిచ్చె
పారిజాత సులిచ్చె ఫలములిచ్చె
కప్పురకస్తురులిచ్చె, గంధంబులర్పించె
గండపెండేరమిచ్చె కనకమిచ్చె
గానముగలవాడు, నవనీతమనమువాడు
పగరకైనను శుభములె పల్కువాడు
పలుకుపలుకుననును తేనె లొలుకువాడు
చెలిమికనువగువాఁడు మాతెలుఁగువాఁడు.

౯

ఆసేతుహిమనగ దేశమంతట మెట్టి
అద్వైతసుధఁజిల్కి యమరినాడు
ద్రవిడభూమినిబుట్టి రహిమించుభక్తితో
ఘనవిశిష్టాద్వైత మనిచినాడు
భక్తులకాణాచి వంగభూమికి నేగి
భక్తిచైతన్యంబుఁ బంచినాడు

షట్ఛాస్త్ర వేత్తయై సాహిత్యదీపమై
శ్రీనవద్వీప మూరేగినాడు
ఉరుదు, నరబిక్కు, పార్శీలఁ గఱచినాడు
భాగ్యనగరి సేనుంగెక్కి ప్రబలినాడు
పూన, సాతారలో గెలుపూనినాడు
దిక్కులన్నిటఁ దీపించెఁ దెలుఁగువాఁడు.

౬

సీతాపహరణంపు సిగ్గునోర్వక వార్ధి
కన్నిటి కాలవ కార్చినాడు
పాండవారణ్య సంవాస భారముఁ దోసి
కౌరవదౌష్ట్యంబు దూరినాడు
బుద్ధదేవుని సుప్రసిద్ధ సూత్రములను
భరతఖండము నెల్లఁ బంచినాడు
అలసబర్మతి యోగిపలుకుతోడై నేడు
దేశసౌభాగ్యంబుఁ దిద్దినాడు
ఏడుకొండలనుండి భూమేలినాడు
ఆది, మధ్యాంతరహితుఁడ నాదివాఁడు
ఉడుపథంబున తారాళిన ల్లుకువాడు
దివిని వెలిగెడువాడు మా తెలుఁగువాడు

౧౦

సర్వసర్వంసహా చక్రిమంతయు వెల్గు
దివ్యతేజఃస్ఫూర్తి తెలుఁగుకీర్తి
స్వారాజ్యసౌభాగ్య స్వర్గసంపదలంది,
మనియెడుగాత మా తెలుఁగుమూర్తి
ప్రాచీనసభ్యత్వ పౌరసత్వమునంది
వెలుఁగుచుండెడు గాత తెలుఁగురక్తి
శమదమంబులఁగల్గి జగతికి రక్షయై
తేజరిల్లెడుగాత తెలుఁగుశక్తి

మానవాళికి నొరవడి న్మెడువాఁడు
పాడిపంటల సుభగతఁబరగువాఁడు
ఇలచతుష్షష్టి కళలను గులుకువాఁడు
గుణముసత్త్వంబుకలిగిన తెలుఁగువాఁడు.



# ఆంధ్రక్షేత్రము.

౧

అమరవ్రాతప్రపారిజాతము, మహాష్టైశ్వర్యసంజాతమున్
విపులాంభఃపరిపూరితమున్ మణిగణాకరగర్భప్రస్ఫీతమున్
కమనీయామృతసస్యదృశ్యఫలసత్కాసారసంపూర్ణితమున్
సుమసంశోభితకాననీయతరుకాంతోద్భూతవిఖ్యాతమున్
అమలోదారమనీషిసేవితము, మా, ఆంధ్రావనిక్షేత్రమౌన్.

౨

సస్యశ్యామలశోభితంబు, ఋషిహంసావాసభాసంబు, ప్రే
మాస్యభ్రాజిత హ్లాదభావకము, బ్రహ్మజ్ఞాని సంసేవ్యమౌ
దాస్యంబెట్లులిఖించె? నీనుమటతథ్యంబుం చునో ఆంధ్రమా!
వశ్యంబైతి వెసోకుమూకలకు, సౌభాగ్యంబు గోల్పోయితే!
జోస్యంబైనను జెప్పరైరి మునిరాజుల్ మున్ను లోకార్థమై.

3

ఇది వేంగీశులపుణ్యభూమి, యిటలేవెన్నండువీక్షింపగన్
మదిచూరాగ్నిసినపాడియావులవధంబుల్ మించుకోష్ఠంబులన్
మదిలజ్జింపని శ్వేతకన్యలకు నింపౌనగ్న నృత్యంబులున్
హృదయాభీలకఠోర,కంటకమహాహేయంపుజట్టంబులున్.

### ఆంధ్రస్మృతి.

౪

మౌర్యసామ్రాజ్యరమా నర్తనగురుఁడు
చాణక్యుఁడోనమాల్ చదివెఁ జట
మొగలుసామ్రాజ్యపు మోహనచ్ఛత్రింబు
వీరబలుండిటఁ జేర్ల నేర్చె
కాకతీరత్న యుగంధరుఁ డిచ్చోట
ఢిల్లిసుల్తాను గుండెల వసించె
కర్ణాట రాజ్య రక్షా దీక్షితుండైన
తిమ్మరుసారవళ్లఁ దిద్దెనిచట
భూరి తేజులు, ననఘులీ పుణ్యభూమి
పాలిపండించిరెప్పుఁడు ముత్యాలపంట
పంచిరఖిలశ్రేయఃకీర్తి పాయసముల
ఏల ప్రభవించె నేఁడు దుష్కాల ఘటిక?



# ఆంధ్రేశ్వరి.

౧

లేఁగీ లేఁగని పిల్ల జుంజురులు ప్రేరేపించు నెమ్మోమునన్
సాగీ సాగని తప్పలే నడకలాశాజ్యోతి దీపింపఁగా
మూగీమూగని మాటదొంతరలు సమ్మోహంబుఁ జిందింపఁగా
వీగీ వీగని సంభ్రమంబడరుకీర్తిన్ జిల్కు ఆంధ్రేశ్వరీ
రాగభ్రాంతిని వెల్గు దివ్యకళ నారాధింతు నశ్రాంతమున్.

౨

శ్రీలంబొంగెడు జీవగడ్డవయి, సుశ్రేయంబులన్ గూర్పువీ
రాలాపంబులఁ బేర్మియిక్కవయి, యుద్యత్సాంగమాంగల్యమై
వాలాయంపు కనత్కృపారససుధా వాల్లభ్యలభ్యాత్మమై
జాలింగొల్పెడు నీత్రికోటిసుతులాశాపూర్ణ సంకల్పమున్
ఆలోకింపవదేమి వేగ, జగదంబా! తల్లి! ఆంధ్రేశ్వరీ.

3

సమసెన్ వొల్లిటి యాత్మగౌరవము దేశంబున్ పరాధీనతా
తమముల్ పైకొని యావరించినవి, యుద్యత్ప్రాజ్య సామ్రాజ్యభో
గములా ప్రాక్తనగాథలయ్యె, మరిసంగ్రామైకశక్తుల్ సనెన్
క్రిమతన్ సోదరులన్యభాషలరహిన్ రగిల్ల నీదాస్యపుం
దమకంబెట్లు భరింతువమ్మ? జగదంబా! తల్లి! ఆంధ్రేశ్వరీ!

౪

కాలగ్రంథమునుండి యబ్దపుటసంఘాతంబులున్ జారె భూ
పాలుర్ పెక్కురువిస్మృతిన్ జసిరి; సుస్వారాజ్యసౌభాగ్యవి
త్తలాలిత్యముదూరమయ్యె; పృథువాత్సల్యంబుపొంగారగన్
పాలింపంగదవమ్మ! ఆర్తులము సుమ్మా తల్లి! ఆంధ్రేశ్వరీ.

౫

శ్రుతివాగర్థవితానసంపదలచేఁ శోభిల్లుపుణ్యోర్విని, నే
డతిదీనంబయి, శోకపీడితమునై యల్లాడుచుండెన్ సదా
వెతలన్ గుందెను రాంధ్రలోకము సర్వస్వంబునన్ జేసె మా
క్షితికిన్ వేగస్వరాష్ట్రసిద్ధికయి, అశీస్సిమ్మ! ఆంధ్రేశ్వరీ.

౬

ఆద్యంతంబును లేని విశ్వజలధిన్నాకారూఢ సద్వీపమై
హృద్యశ్రీప్రోజ్జ్వల వీరగాథలవెలార్చెన్ నీదుచారిత్ర్యముల్
ఉద్యన్మోహనమై, త్రికోటిసుతకల్పోర్వీరుహోత్తుంగమై
సద్యోజాతసువర్ణరత్నమయమై సంధిల్లుమాంధ్రేశ్వరీ!

# వేదన.

౧

నిద్రంజెందుచునుండెపూర్వకవి పాండిత్యంబు తంజావురిన్
ఛిద్రంబయ్యెడి నాంధ్రశిల్పమహిమాశేషంబజంతాగిరిన్
క్షుద్రంబయ్యెడి నాంధ్రసోదర యశశ్శ్రీశ్రీధరాగ్రంబిలన్
భద్రంబెప్పుడు గూర్తువో! యిది మహాభారంబు సుమ్మాంధ్రుడా

౨

ముద్రంజూడక తాళపత్రగతమై బూజెక్కె మా కైతలున్
రుద్రుంజేరెను డక్క మస్లిముల సౌరుం జిల్కు మా నేతలున్
ఉద్రేకంబొగి లేక సన్నగిలె యుష్ణోద్ధాత్రి మా చేతలున్
భద్రేభాదిసిరుల్ హరుల్ సమసెనబ్బా! పంచబంగాళమై.

3

ద్రవిడప్రాంగణభూమినంటిచని యోర్ త్యాగయ్య గానంబు, హా!
భువికర్ణాటకుఁడయ్యె నాంధ్రవిభుఁడౌ భూజాని, కృష్ణుండు. నే
డవురా! చెన్నపురంబు పిడితో లాగెన్నాంధ్రావనిన్ భీరువై
చవులన్ జిమ్మెడు తెల్గువాణికిక ప్రాశస్త్యంబు లేదెచ్చటన్
రవికోటిప్రతిభన్ జెలంగగను మా రాష్ట్రంబు ఓ! ఆంధ్రుఁడా.

౪

అల వేంగీశుల కాలగర్భమున, చిహ్నంబైన లేకుండెడిన్
ఆలకాకత్యనృపాలసింహుల సయ్యాటల్ గనన్ రావు హా!

అలక్రొంగ సుకవిపల్లవాంధ్రవిభు పేరైనన్ వినంరాదు, ఉ
జ్జ్వలచారిత్ర చళుక్యరాజప్రభు ప్రస్తావంబు పూజ్యంబు, నే
డిలసర్వార్థ్యనిరర్థకంబు జనముల్ హెచ్చాయిరో ఆంధ్రుఁడా

౫

చెన్నుందక్కెను ఛిన్నభిన్నమయి మాక్షేత్రింపు తేజంబులన్
ఖ్యంబైముల రారె వాంధ్రుల యశస్సాంద్రైకజ్యోత్స్నావళుల్
కన్నీటన్ జలకంబులాడెడిని ధిక్కారంబు తాసైపమిన్
న్నెంబెట్టుము 'ఆంధ్రమాతకు' మహాభాగ్యంబు సుమ్మాంధ్రుడా.

౬

సక్కాముల్లుపసంబుపోయె, కృషి రాట్నపాణిగి తార్ఘటుల్
సక్కాణింపవు భావి భాగ్యముల, శుంభత్ దాస్యబీజంబులన్
దిక్కుల్ మిక్కిలిపిక్కటిల్లినవి, యే దిమాకుగత్యంతరం
బిక్కాలంపు మహాత్ములన్ దెగియు వాణిజానికిన్ శక్యమే?

౭

రాయల్ సీమ మహోదయుల్ జనిరి, వక్రంబైన మార్గంబునన్
హాయిన్ గాంచిరె? మున్ను భాగ్యనగరీయాంధ్రుల్
విభిన్నంబునన్
ద్రోయన్ రారు 'బ్రిటీషు' నందు, మనుగాంధ్రుల్ మూడు
మార్గంబులన్
శాయన్! గావలె నైక్యమార్గ సులభోపాయంబు
సుమ్మాంధ్రుడా.

౮

తెలుఁగుం దేశము ముక్కముక్కలయి నిస్తేజంబుగా నుండెడిన్
తెలుఁగుం దేశికులందరున్ని తెలుఁగుల్ దీపించి రాంధ్రావనిన్
తెలుఁగున్ భాసది లెక్కయించనబడెన్ దేశంపు సద్భావలన్
తెలుఁగున్ వారికి నైక్యమార్గము ప్రసాదింపంగ దే'ఆంధ్రిడా!

౯

పలుచం బారెను తెల్గురక్తమిపుడే బాటన్ విచారించినన్
దొలఁగెన్ దొల్లిటి దేశగౌరవము, గురుల్ లేక యేదిక్కులన్
గలఁగెన్ కాకతి, శాతవాహన చళుక్యశ్రేష్ఠు కీర్తిద్యుతుల్
చలనంబొందె తెలుంగుభూవలయమా శాజ్యోతి క్షీణించె, బల్
విలయంబొప్పెడి భోగభాగ్యముల కెవ్వీటన్ విలోకించినన్

౧౦

ఒడ్డివారికి తొల్లి యొడ్డారముఁ జూపి
ఒడ్డికిప్పుడు తలలొగ్గవలసె
తమిళతంబుల నెల్లఁ దరిమిన మనతల్లి
తమిళులకీనాడు తగ్గవలసె
కర్ణాటలక్ష్మినిఁ గాదను మన దేవి
కర్ణాటబేహలఁ గవయవలసె
ఔత్తరాహులకెల్ల బత్తి నేర్పిన సాధ్వి
ఔత్తరాహులకొత్తు లొత్తవలసె
ఔర! కాలము వారింప నేరితరము?
నిత్యమాంగల్య కలకల నినదమొసఁగి
లక్ష్మితాండవంబాడు మా రాజ్యమిపుడు
చితికిలంబడె దాస్య పిశాచినోట.

# పూర్వశోభ.

౧

పరదేశాలనువర్తకంబమరె శోభన్ 'మోటుపల్లీ' పురిన్
సిరులన్ గ్రుమ్మరె నాంధ్రనౌకలచటన్ స్వేచ్ఛావిహారంబులన్
వఱలెన్ దామరతంపరై, మృదులమై, పాకాలధాన్యంబిలన్
సురలోకంబుగ నాంధ్రభూమిదిశలన్ శోభించె మున్నాంధ్రుఁడా!

౨

అకలంకంబుగ నాంధ్ర నావలలనట్లాడెన్ 'మసూలపట్ణమం;'
ప్రాక్కాలంబున నాంధ్రవీరులు, బళీ! యుత్సాహమేపారగన్
ప్రకటింపించిరిపొట్టునూరికడ వీర శ్రీజయస్తంభముల్
ఒకచో నాయకురాలు మందఁబొడిచెన్ 'హా!' యంచునో ఆం॥

3

ఠవణిల్లెన్ ధరజ్ఞానసంపదలతోడన్ దెల్గుమాగాణి సం
భవమొందన్ సురతుల్యులౌనుపనిషత్ బ్రహ్మైకజిజ్ఞాసువుల్;
సవనాశ్వంబులు గ్రుమ్మరెన్ విపులసంచారంబులై యెల్లెడన్;
సవనేచ్ఛారతి జన్నిగట్లుగలరోజన్ ధర్మపారీణులై;
పావనాక్రాంతసుధూమమీ భువికదయ్యా! తొల్లి ఓ ఆం॥

౪

విహరించెన్ విపినాంతరస్థలుల, నన్వేషించె శాస్త్రార్థముల్
గహనంబందున నాశ్రమ పళులు నిర్మాణించి ఛాందోగ్యస

ద్బృహదారణ్యక, ముండకాద్యుపనిషత్ పీయూషపానంబుచే
మహిరాజిల్లి వెలింగె మానిషుల సామ్రాజ్యంబహో! ఆం॥

౫

వినిపించెఁ దొలి బ్రహ్మసూత్రముల గంభీరంపు వ్యాఖ్యానముల్
ప్రణుతుల్ వొందిరి పుణ్యభూమినిచటన్ పతంజలుల్ పాణినుల్
గానముల్ ప్రౌఢులు భాష్యకారులిట నుద్ఘోషించి రామ్నా
యముల్
కననయ్యెన్ మునిసంతతిన్ కనక కాంక్షాలోలతన్ నేఁడిటన్

౬

కోహినూరెందున జన్మమొందెను! లసత్ కోటీర మాణిక్యముల్
మహి నేతల్లిసుగర్భముక్తములుగా మాన్యత్వమందెన్ మహా
మహులతా భూధనమస్తకంబులపయిన్ బాశ్చాత్యలోకంబులన్
రహితన్మాలిన ధర్మమైతనరి తోరంబైన యాధాత్రి తా
బహుకీర్తిన్ గనె “కృష్ణవేణి” యిదినీ భాగ్యంబుసుమ్మాంధ్రిడా

౭

ఎన్నోకోటుల కిమ్మతైబరగ మున్ని రత్నమాణిక్యముల్
ఛిన్నాభిన్నములయ్యె నద్దెసలవాసింగాంచె రాణ్మండలిన్
విన్నంబాటువహించె లోకము, భవద్విస్ఫీత భాగ్యంబుచేన్
చెన్నుగాంచెను ‘కృష్ణవేణి’ జననీ శ్రీరేఖ మున్నాంధ్రిఁడా॥

# తెలుఁగు తల్లి.

౧

ఆరాధింపుము 'తెల్గుతల్లి' నెప్పుఁడుద్యద్భక్తి పెంపారగ!
ఘోరాభ్రంబునఁ గారుమబ్బులలమెన్ గోలాహలధ్వాన్తమై
దారాపుత్రరమల్ తిరంబె? ఖిలమౌఁ దత్కాలభేదంబుచేన్
వీరవ్రాతముపోవుదారిఁ జనుమా వీరాగ్రణీ! ఆంధ్రుఁడా!॥

౨

ద్విజులున్, గాపులు, కమ్మ, రెడ్డి. వెలమల్ వీర్యంబు రేకెత్త, మా
ధ్వజినీకాండపురాతనాంధ్రవిభవప్రౌఢిన్ విడంబింపగన్
గజవాజుల్ భటరాజిముందుఁజన, నాకంబంటు తల్పసల్ల, వే
భుజముల్ భారతపంచవర్ణపట సద్భాషావళుల్ గప్పగా
విజయాశీస్సులనంది శోభమనుమా! వేంగీమహీమాతరో!

3

భవభూత్యాంధ్రిఁడు, మల్లినాథబుధుఁడున్ భద్రాంబ,
శాకల్యుఁడున్
కవినారాయణతీర్థ, శ్రీధరుడు. నన్నంభట్టు, నాగార్జునుల్
ధ్రువతారల్ బలెఁ ప్రాకృతాంబరపు వీథుల్ నిండి దీపింతురా
నవదీప్తుల్ గురిపించు చంద్రుఁడు జగన్నాథుండె కాఁబోలు న
ల్లవిగో చూడుమ! కేలుమోడ్చి మనుమా! హుంకారతన్నాం

౪

విద్యారణ్య, కపర్ది భాస్కరకవుల్ విశ్వేశ, గంగాధరుల్
విద్యానాథుఁడగస్త్యుఁడున్ హరిహరుల్ శ్రీసింగభూపాలుఁడున్

హృద్యంబై నన్నెసింహ భల్లట,కుమారిల్ భట్టు, కృష్ణాధ్వరుల్
ఉద్యత్కీర్తులు, దివ్యులాంధ్రులుగదా యున్నారు తారాళియై

శా

ఆనందాంబుధిఁదోలలాడిమను మమ్మా నీవుసృష్ట్యంతముం
వాణీసేవపరాయణుల్, గుణఖనుల్ పాండిత్యతేజోనిధుల్
నానాపుణ్యపురాణపూరుషులు విన్నాణంబుగా నీదుగ
ర్భానన్ జన్మముగాంచి దివ్యయశతన్ వర్ధిల్లి రాంధ్రావనీ!

ఓ

తమిళమాగాణంబుఁ దండెత్తి పండించె
రాచపాళెపునీదు రాచకోలము
కర్ణాటవాణికిఁ గఱపె నీ ఛందంబు
నాగవర్మాభిఖ్య వేఁగిబుధుఁడు
అంగ, వంగ, కళింగ, దహూత్తరాహులకొజ్జ
బంతుల నేర్పిన భాగ్యవతివి
ప్రథితమహారాష్ట్ర రాజు శివాజికి
రాజ్యతంత్రమిడిన రాణివీవు
దర్శన శుభావహాకార ధన్యవీవు
వింధులోనగూర్చి వజ్రాలఁ జిఁదినావు
తెలుఁగు మాతల్లి నేఁడిట్లు దీనవైతె
కాలగతుల నెవ్వారలు గడపగలరు?

# ప్రతిభ.

౧

ఉదయంబయ్యెఁ దెలుంగుభాస్కరుఁడ దెన్నో వేలయేండ్లాయె, నీ
విదితాధ్యాత్మిక భారతాంబరమహావీథిన్ ప్రభావంతుఁడై
మదమాతంగతురంగసంఘములతో మధ్యాహ్నశంఖధ్వనుల్
ముదమొప్పార ప్రచండరశ్మిఁబఱపెన్ భూభాగమందెల్లెడన్
ముదిమిన్ బోఁడిమివాసెఁ గాఁ హారణంబున్ జేసి నేఁడాంధ్రా!।

౨

కడుజీర్ణంబులురమ్యహర్మ్యములు ప్రాకారంబులున్ కుడ్యముల్
జడతన్ వైచెడుకోటదిబ్బలును వైశాల్యోరుకాసారముల్
బిడియంబొందెడుతోఁటినాఁటిమలునుర్విన్ మోదముల్ గొల్పు నే
సుడిగాలింబలె వీచివ్లినవి మాక్రోశోర మాలాస్యముల్
పిడివాదంబుల కేమికార్యమగు? నన్వేషింపు నీలక్ష్మినిన్॥

3

ఉరుప్రజ్ఞాఢ్యుఁడవై, యశోంబునిధివై, యుత్తుంగప్రాగల్భ్యతన్
గురుదర్పంబున పృథ్వినేలితివి బల్ క్షోణీధవుల్ మచ్చ మున్
పరవింధ్యాచల, కన్యకుబ్జ నగరీప్రాంతోన్నత క్షేత్రముల్
విరసంబయ్యెను నీసువీర్యమిపుఁడీ విఖ్యాతదేశంబునన్
నరులెవ్వారికిఁ గీడుచేర్లలవనిలో సాజంబులౌ ఆంధ్రా!॥

౪

జననం బందెను భూరిశోభన విలాసంబుల్ గుబాళింపఁ గా
ననమౌ మాగధభూపుగద్దెపయి, సభ్యత్వంబుచే మధ్యపుం
దినమార్తాండుని బోలె నావిపుల వేంగీసింహపీఠంబునన్
వినుతింపం బడెఁ, బురాతనాంధ్రజననీవిఖ్యాతి నూహింపుమా॥

౫

తొలిమా నన్నయభట్టు మెట్టుటనుపూతుండయ్యెఁ జాళుక్యరాట్
కలిశాసెంగద తిక్కయజ్వబుధుఁడుండన్ మన్మభూజాని; స
త్కులుఁడౌ యెఱ్ఱనకీర్తిలో విపులకీర్తుల్ గాంచిరా రెడ్లు; మా
యిలధన్యంబయె, మూడుమూర్తులకళాసృష్టిన్ సుధాపూరమై

# ఆంధ్రుల దుస్తులు.

౧

నిజవేషంబును వీడి దుస్తులకునై నిత్యాభిమానంబునన్
గిజిగాడట్టులఁ దొల్లుచుందువకటా! గ్రీష్మంబు హెచ్చించు నీ
విజనా మోదపుటల్లిబిల్లి ముసుఁగుల్! భీతిల్లరే బాలికల్!
సృజనన్నాలరి బ్రహ్మ చేష్టములు వీక్షింపంగఁ జోద్యంబగున్

౨

ముడుగుం దోవతిపింజె బింకమడరన్ మాన్యంపుష్ణీషమున్
పొడవైనట్టి స్వదేశ పంగరకయున్ బూజ్యోత్తరీయంబునున్
కడుదట్టంబులు పాదరక్షలును, చొక్కంబైన పెన్ జుక్కయు
నిడుదౌ వేత్రికరంబుతోఁ దెలుఁగు మన్నీడౌచు నిశ్శంకతోన్
నడుమా! బాటను రాచఠీవులొలుకన్ రాగంబుతో నాంధ్రుడా॥

3

నొసటన్ బాపటబొట్టు ముద్దులొలుకన్ నున్నారు లేఁజెక్కులన్
మెసలంగాఁ దెలియాణిముత్తెమటు ఘర్మాంబుల్ ప్రభల్ చిల్కుచున్
దెసలం గూఁకటు లూఁగఁ గ్రొం బసిడిఖాదీకోక నేకాలమున్
బుసపుంగుంకుమలొప్పఁ దాల్చు తెలుఁగంబా నీకు సౌభాగ్యముల్

౪

పరువున్నిల్పును తెల్గుతేజమిగురింపన్ నీదు మూర్తిన్ సదా
మఱపుం దావవి నీదు కృత్యములు సమ్యక్ దృష్టి వీక్షింపగా
గఱుసుం గత్తుల కాకకోర్వకయె నిక్కంబ్లై నెనోన్నతన్
పెరభూమీశుల సైన్యకాండములు పెన్భీతిన్ రణోర్వీస్థలిన్
నరసింగాత్మజతిక్కనాది మొనమిన్నల్ మున్నుఁదా ప్రాణముల్

# గోదావరి:

౧

విమలంబై, శుభదాయివై, శరదుదావిర్భూత నైర్మల్యంబునై,
కమనీయంబయి, కర్షకావళికి పెన్ కల్పద్రుమంబై, సదా
సుమనఃప్రోజ్జ్వలవై. మునీంద్రజనసంస్తుత్యంబునై యొప్పు నీ
నమలోదాత్త మనీషవై బ్రతుకుమమ్మా! తల్లి? గోదావరీ?

౨

జననంబొందితినీదుగర్భమున, నీస్తన్యంబులేఁ ద్రావితిన్
ఘనవాగర్థము లెన్నొ నేర్చితిని, ఆంధ్రాంగ్లంబులన్ నీకడన్
మునునీవీచికలందు గ్రుంకులిడితిన్ బొంగారుమిత్రాళితోన్
ఘనకీర్తిన్ వెలుగొందుమీవు, జననీ! కల్యాణి! గోదావరీ!

3

పారావారసుసాధ్వి! నీపయిడిగర్భంబందునన్ వజ్రముల్
తోరంబొప్పకళావిలాసములతోఁ దూగాడ నీర్ష్యగ్నరుల్
వైరంబూనికరంబు నీకడుపుఁ దిప్పల్ దెత్రు పెన్గట్టుచేన్
ప్రీతిన్ జరియింపఁదప్పవుకదా! యిక్కట్లు గోదావరీ!

౪

"శ్రీవాణీగిరిజాశ్చిరాయురను" నాశీర్వాదసూక్తంబు, ము
న్నావిర్భావమునొందెనీదరుల నన్నబ్రహ్మసృష్టిప్రభన్
మా వేంగీజనయిత్రినోమితివి సమ్యగ్ప్రాభవం బేతగాన్
నీవైదగ్ధ్యమె నిత్యజీవనము క్షోణిన్ మాకు గోదావరీ!

౩

దృప్తాంధ్రపౌరుషదీప్తి ధావళ్యముల్
పాయలై, తరంగలై పారునేమొ!
చాళుక్యభూజాని శౌర్యాగ్ని కీలలు
భూరిస్రవంతులై పొంగునేమొ!
నన్నభట్టుసుకవి వాఙ్మాధురీ రసధునుల్
పాకమై, వాకలై పర్వునేమొ!
సోమనార్యునిరాగ సూక్తిసుధానిధుల్
వెల్లువలై పైకి త్రుళ్లునేమొ!
ఘనమృకండాత్మజు గౌతమమునిసత్వ
తేజంబు నీలోన దించునేమొ!

వసుమతీ భాగ భూరిధూర్వహతవలన
కలతఁజెందిన యాంధ్రులఖ్యాతి తిరిగి
గాంచు చాచంద్రతారార్కమంచితముగ
భూమి వర్ధిల్లు గోదావరీమ తల్లి!

# రాజమహేంద్రవరము.

కలదుత్ఫుల్లసరోజ కాండనవ రేఖామల్లికా మాలికో
త్పల శీర్యన్మధురాసవంబు హృదినాస్వాదించువిద్వద్ద్విరే
ఫులకావాసము, రాజ్మహేంద్రవరమొప్పున్ శ్రీకళాభాసమై
తెలుఁగుంభారతి కావ్య పుత్రవిహరత్ క్రీడావిలాసంబునై

2

గణిచాళుక్యుఁడదే ముహూర్తమున శంకుస్థాపనం జేసెనో
గాని యెన్ గిరి నినన్న పార్శ్వగజమా గోదావరీపెన్దరిన్
పరిణతుల్ వొందెడి రాజ్మహేంద్రివర విజ్ఞానంపుసంపత్కళల్
ఘనపీయూషమరందధారలొలుకన్ గావ్యాళి నేఁడాంధ్రుఁడా.

3

తెలిఫేనములఁ గ్రక్కు లలితగంగాధునుల్
చదలేటిబంగారు చలువలీన
వేఁగిరాకొమరుని విఖ్యాతకథనముల్
పల్లెవారల జాన పదములవఁగ
వినువీథినునుఁగాంతి వెలయునా బొమ్మూరు
వెండికొండయొనాగ విందుసలుప
పొరికోటిలింగాలు భూరిపుష్కరతీర్థ
వారిపూరముఁజిమ్మ తీరునెనయ
వెలయు కందుకూరి, వద్దాది, చిలకమర్తి
న్యాయపతిబుధుల్ ధ్రువతారలోయనంగ
సత్కళానిధి రామరాట్ చంద్రుఁడొప్ప
స్వర్గతుల్యంబు రాజమండ్రి స్వర్ణపురము!!

## కవిస్తుతి.

౧

నన్నయకవిముఖ్యు చిన్నిబిడ్డనుగాంచె
గీర్వాణభాషామృగేక్షణకును
పాలపాశములలో లాలించిపాలించె
కుండలీంద్రుడు మక్కువలమిగుల
పెంచిపెద్దగఁజేసెఁ బ్రేమతో శ్రీనాథుఁ
డాంధ్రనైషధకావ్య మమరఁజెప్పి
పూతచరిత్రుండు పోతన్నవిబుధుండు
సర్వాంగసౌందర్య సదనఁజేసె
సూరన్నసొన్నారి కోరితాఁజేసెను
తారహారంబు లింపారమూఁడు

తగినవరుఁడని యెంచి పితామహుండు
పెండ్లిసల్పెను కృష్ణభూ విభునకిచ్చి
మెట్టినగృహంబునకును దాఁబుట్టినింటి
కిని తెలుఁగుబాస పూఁబోడి కీర్తిదెచ్చె॥

## కుకవి.

యతియున్ బ్రాసయు లేక వృత్తనియమాభ్యాసంబు పూజ్యంబు
సతతంబున్ పెరసంప్రదాయములకై స్వచ్ఛందవృత్తార్థ్యమై
మితకావ్యంబుల్ వ్రాసిహూణవిధులన్ మేలంచుఁగీర్తించుచున్
యతికోలెన్ దిరుగాడు కాకవి సమూహంబున్ మదిన్ రోసెదన్॥

# తిక్కన.

౧

బాణోచ్ఛిష్టము సర్వమంచు వినెదన్ ప్రాచేతసప్రోక్త గీ
ర్వాణంబంతయుఁ గావ్యసృష్టి రవణింపన్ నీదు వాఙ్మేఘముల్
పానీయామృతవర్షధారఁ గురిసెన్ భాషాప్రపంచాన, నీ
వాణీవైఖరి మించె మాకు తెలుఁగై వైదుష్యవాచస్పతీ॥

౨

అమరత్వంబును బొందినాఁడవు కవీంద్రా! నీదు భాషాతతుల్
సుమనోభూషణపుష్పమంజరులుగా శోభిల్లెనాకంబునన్
గములం జిమ్మెజవాది, కప్పురపుపల్కుల్ తెల్గువాగ్గంధముల్
కమనీయామృతగాంగధారలొలుకంగా నీదువాఙ్మాధురుల్
సమతన్ లోకము లేలుకొమ్మభిరతిన్ స్వర్గీయరాష్ట్రంబులన్॥

3

నీకావించినసృష్టియన్యులకిలన్ నేర్పింపగా శక్యమే?
నీకావ్యామృతవృష్టి వేదరసమై నిండన్ త్రియఃకోటి గీ
ఔకావ్యాంధ్రజగత్తుసర్వము పునీతంబయ్యెఁ దద్ధారలన్
నీకుంజాలిన కావ్యకర్తలిక క్షోణిన్ రారు వేయేండ్లకున్।

౪

భావౌన్నత్యము, పాత్రపోషణ, లసత్ వాగర్థసౌందర్యముల్
తావుల్ క్రేపలఁ జిమ్మె శబ్దములు, శుద్ధాంధ్రోక్తులున్ సత్కళా

శ్రీవైచిత్ర్యముపొంగులీనునుడులన్ సృష్టించినమాకైతకై
నోన్నవన్నెల్ పచరించిగుల్కితి తెలుంగోక్తుల్ భువిన్ మ్రోగగన్

౫

తేనెల్ తేటలువారుదివ్యరుచులుద్దీపింప నీకావ్యమం
తేనిన్ సంతతమోదవార్నిధులఁ బ్రీతిన్ దేలియాడించుఁ; గా
దేనిన్ సాధ్యమె వ్యాసనిర్మితకళాసృష్టిన్ మథించంగ? నీ
వాణీశ్రీలజరామరత్వముగనెన్ పాండిత్యతేజోనిధీ॥

౬

ఉన్నారెందరొ తెల్గుబిడ్డలు; మహోద్యోగంబులందుండి సం
పన్నప్రక్రియ నేర్పరింపగలధీమంతుల్ మహోదారులో
యన్నా! తిక్కన! నీదుమూర్తి నిలకన్నారంగ వీక్షింపగన్
వన్నెల్ గ్రక్కెడునీశిలాప్రతిమనైనన్ వేగనిర్మింతురో!

## కవిత.

౧

కవితాధారకు మేరయున్నదె? వచఃకౌశల్యమే పారగా
జవతోఁ గూడినశబ్దజాలములు తేజంబొప్పఁగుప్పించుమన్
చవులంజిమ్ముచు, హావభావగుణభాసంబై, జనామోదమై
చెవికింపౌ మృదుభాషయే కవితనాసిద్ధంబు సుమ్మీ ధరన్॥

౨

రసమూలాలుచరాచరాత్మక మహాస్రష్టృప్రపంచాణువుల్
రసమేప్రాణముకావ్యకోటికిని సారస్యైక భాషాళికిన్
రసహీనంబగుకావ్యమేవిధమునన్ వ్రాయన్ బిపాళించునే?
రసమారాధనసేయునట్టిమనుజుల్ వ్యర్థుల్ విచారింపగన్ ॥

3

కవితారాజుకలంబెమంత్రియు,లసత్ కావ్యాలెసామ్రాజ్యముల్
కవితంజిప్పిలుచారువృత్తగమన వ్రాతంబె సైన్యనదయా
కవితారాజ్యరమాధురంధరత నేకచ్ఛత్రమీవేలు, స
త్కవివై, కాకవిమూఁకఁగాఁగవఝు, లోకంబంతయుబ్రంపడన్ ॥

౪

కవులెవ్వారలునిండు పేదరికపుంగానన్ బ్రవాసించుచున్
నవనీతాత్మకకావ్యకోమలినియే నాగయ్యకోయిచ్చి తా
భువిజీవంబులనిల్పుచుండిరకటా! పూజార్హులౌనట్టి యా
కవులఁ జేయుమ చక్రవర్తులుగ యుక్తంబిద్ది,ఓ! ఆంధ్రుఁడా॥

౫

అరిషడ్వర్గముగెల్వనేరక,సదావ్యామోహచిత్తానసో
గిరమున్ మెక్కుచు,మత్తులై చెలఁగుచున్ కేళీవిలాసంబునన్
నరులన్ బీడనసేయుభూరి నృపసంతానంబుతామర్థపుం
తెరువుల్ తెర్వగనిండు! సత్కవులుప్రీతింజెంద నశ్రాంతమున్ ॥

# మాతృభాష.

హూణుల్ వ్రాసిన గ్రంథజాలముల కైహారో యుంచు నెన్నోగతుల్
గానంబుం దగ సేతు వెప్పుడును నిర్మాలిన్యమోదంబుతోఁ
బ్రాణంబుల్ కడతేరు నాళ్లయిగుచుం మా తెల్గుకమ్మన్నచో
“బోణీ”యైనను సేయ రావు తెలుఁగుంబాత్రంబు పేరెత్తనం॥

౨

తలగున్ మానస మెప్పుడన్యగతులన్ దార్ఢ్యంబు తగ్గున్ వెసం
అలుకన్ సెందెద రేలకో తెలుఁగు పేరన్నన్ సదా సోదరుల్
తెలుఁగు దేశము పుట్టువై తెలుఁగు మాతృస్తన్యముల్ ద్రావుచుం
దొలఁగం జేయుమ భావదాస్యము మహా దోషంబ సుమ్మాంధ్రుఁ

3

పెరజాతీయవికాససంపదల కువ్విళ్లూరి యశ్రాంతమున్
పెరభాషానవసంప్రదాయముల నన్వేషించుచున్ స్వీయవి
ద్యారవంబైనను నేరకుండ భువిలోఁ దంభోక్తులన్ బల్కు సో
దరబృందంబుల కేమి తెల్పెదవొ! మాతల్లి! త్రిలింగేశ్వరీ॥

౪

ఆంధ్రంబం చెపుఁ డాంధ్రరాష్ట్రమనుచుం ఆర్భాటముల్ సేతువో
ఆంధ్రా! దెందము దంభసంభరితమై యాశించు నుద్యోగముం
ఆంధ్రంబన్న నెరుంగ నేరవిల పూజ్యం బాంధ్రసాహిత్యముం
ఆంధ్రుల్ చూడ త్రికోటి యౌఁ జరితముం గైసేయు మవ్వారికిం

౫

తెలుఁగగ్గమె సరించెసోదరవచో ధిక్కారముల్ సైప,ను
జ్వలనా శారదరాత్రి చంద్రికలహాసంబాడు సత్కావ్యమం
జులడిండీర పటీరరత్నరుచులన్ శోభించియాంధ్రావళిన్
జ్వలితానందరసాబ్ధిఁ! లికలనూచన్ లేదె. యొక్కప్పుడున్-

౬

సర్వజ్ఞత్వముమానవోయికుమతీ! సంసర్గకర్మ బునన్
సర్వంబాగ్గమె దేవుఁడంచుమదినిన్ శాసించుభావంబునీ
పూర్వుల్ విన్నను ప్రాణముల్ విడునరా! భూమధ్యమున్
గ్రుంగరా!
దుర్వారక్రిమునన్నయాదికవులీ దోషంబు సైరింతురా?

౭

నీభాషంగలజగ్గునిగ్గులును, వన్నెల్ గ్రక్కుశబ్దేందిరల్
నీభాషంగలతీరుతీయములు' పోనీచూపుమెందేనిమా
సౌభాగ్యంబులనడ్డగింపగల భాషాచారురమ్యత్వముల్;
'మాభాగం'చువచింపడా!''బ్రవును'సంభావించిభాషారుచుల్

౮

నానార్థాత్మకపద్యగద్యములు విన్నాణించువ్యంగ్యంబులున్
నానాబంధురభావసౌరభ భరాంచత్ చిత్రబంధంబులున్
నానాశయ్యలు, పాకముల్, కళలు, నానాశ్లేషవైచిత్ర్యముల్
నానాలంకరణైకకావ్యగుణ సౌందర్యంబుహాసింపునా॥

౯

ఈ భాష వాఁడెగా! శోభించెవంగల
శివరాముఁడు "జగత్ప్రసిద్ధసమితి"
ఈ భాషవాఁడె! మహీసుర "దండిభట్"
మన్ననల్ బడసె శార్మణ్యమునను
ఈభాషలోనుండు నింపుసొంపులఁగుల్కు
పాశ్చాత్యులకు నేర్పెఁ 'బ్రవుసు' తొల్లి
ఈభాషలోఁబుట్టి యినతేజుఁడై వెల్గు
మన 'సర్వేపలి' జగన్మాన్యుఁడయ్యె
నన్నపార్య, తిక్కనవిధుల్ కన్నభాష
నాశముండదీభాష కేనాఁడుజగతి
లొంగదీభాష పెరవారి పొంగులకును
ఎన్నియుప్పెనల్ వచ్చిన నన్ని సమయు।

౧౦

ఊరుదూభాష మనింటియాఁడబడుచా! యుద్యోగసద్యోగముల్
చిరకాలార్జన, పెన్నిధానమటరా? షేక్స్పియరుల్ మిల్టనుల్
సురలోకంబునుడిగ్గు దేవగణమా? శోధింప వాఁధ్రిప్రభల్
సరదాకై నను నేర్వఁగాఁదగవ? గీర్వాణాంధ్రశబ్దంబులన్
మరిరారాంభాగ్యముఁగాక యేమిటిది, శుంభద్దంభ ఆంధ్రార్భకా।

# నవ్యాంధ్రము.

౧

నతలోకుండగు శింకవీంద్రగజపంచాస్యుండు, కావ్యాటవీ
క్షితిగర్జింపనడంగెఁగాక విపులక్ష్వేళారవంబుల్ మనున్
ధృతినవ్యాంధ్రపు సాహితీగగనవీథిన్ జంద్రికాక్షీరముల్
పిత్రికెన్ సత్కవిహంసభావతరఁగల్ చెన్నొందఁ శ్రీఆంధ్రుఁడా!

౨

వ్యవహారాంధ్రమె కావ్యభాషయని సంభావించి పాతంబులన్
దివిటీల్ట్రాలఁజూపెఁబూర్వకవులౌ తిక్కన్న పోతన్నలన్
సవరింపదగునాంధ్రమున్ 'గిడుగు' బిక్షన్ బెట్టె వేయేళ్లకున్
భువిజీవల్లికి మూర్ప్వ. వృద్ధియొసుమీ. మూలంబునుమ్మాంధ్రుఁడా

# ఆంధ్ర విశ్వ విద్యాలయము

౧

"విజయాఖ్యం"గొనుపట్టణమున్ గనకఁ దా వేంచేసె నే మూలకో!
సుజనామోదము గాంచెనో? నగరి దాశ్శోభన్ విలోకించిరో?
ప్రజకున్ సౌఖ్యమె? రాయలాంధ్రులకు నే బాటల్ నిరూపించిరో?
ధ్వజినీకాంతుల మన్ననల్ సతము లే? ధర్మంబుఁ బాటింపరా?

౨

అల వైశాఖ పురంబులో, నగరిలో, నామిట్ట పల్లంబులన్
గలవారందరుఁ జేరిపల్వ్రకు హాక్కొ "విశ్వవిద్యాలయో"
జ్వలశాలల్ నిలపెట్టటన్ విసిన నాసల్ జాఱు నెవ్వారికిన్
విలపింపన్ మన తెల్గు తల్లెపుడు మార్పించంగ జాగేలకో?
ఇల లేకుండగఁ బోవునే నెరసు లూహింపంగ మర్త్యాళికిన్?

3

ఉరుప్రజ్ఞాఢ్యుఁడు కట్టమంచి బుధుఁడో హా! విశ్వవిద్యాలయం
బిరుపార్శ్వంబులనుండి లోటెపుడు రానీకుండఁ గాపాడదల్
కరుణన్ వర్ధిలుచుండె మొక్కయయి, వృక్షంబై, ద్విజావాసమై
స్థిరకీర్తిన్ వెలుగొంది వేమనియెడున్ దీప్తామరోర్వీజమై॥

# ఆంధ్రరాష్ట్రము

౧

కాంగ్రెసువారైనఁ గరుణోకింతయు లేక
  ఆంధ్రరాష్ట్రంబన్న అసలు వినరు
గాంధిదేవుండైనఁగా సంతఁబలుకఁడు
  కార్యభారమదేమొ! కసరుకొనును
పరపీడనముసుంత భరియింపగా రాని
  'జవహరుం' డిసుమంత సరకుఁగొనఁడు
"ఆంధ్రభోజుండైన" ఆపీఠికాపురీ
  క్ష్మాజాని సైత మాజాడపోఁడు
తమిళసోదరులెంతేనిఁ దఱుముచుండ
ఎటులగడియింతువో 'ఆంధ్ర' యింకమీఁద?
జీర్ణశిల్పంబులనుజూచి శిరమువంచి
ముగ్ధభావంబువహియించి మోహపడుట
తప్ప, నీకేది బ్రతుకు? భూతలమునందు.

౨

తమిళాధిక్యతయెక్కువౌటమనకున్ దంత్రంబు హెచ్చాయె, నా
తమిళుల్ లేని 'డిపార్టుమెంటు' కసలే స్థానంబులేదీయిలన్
భ్రమయేగాని, తెలుంగుభూమికెప్డైనన్ పాలనావర్గమై
'తమిళుండుం'డిన, 'ఆంధ్రరాష్ట్రము' నకున్ దావున్నదే? ఆం॥

౩

ప్రతిభావంతులు, శేముషీవిభవసంపన్నుల్ త్రిలింగాత్మజుల్
వెతలంగుందుచు నూరకుండిరిల నువ్విళ్లూరుచున్ నిల్చి, యే
గతియున్ గానకనాంధ్రరాష్ట్రకల నాకాంక్షాత్ములై, యింతఅం
ధతమం బాంధ్రులకేలకోఁ గలిగెఁ బెద్దమ్మా! దరిద్రేశ్వరీ!

# కాలము.

౧

కాలము మారుచుండు, కలకాలము నొక్క విధాన నుండఁగాఁ
జాలదటన్నఁ బ్రాఁబలుకు సారెకు నా మది నిల్చి విస్మయా
భీలతఁ దోఁచె; వెండియును వీరయు గోదయు సాంద్ర చంద్రికో
న్నిర్మల నమంజు రేఖలల మిన్నను గాంచగ నూఱడిల్లితిన్

౨

కాలంబా! వెస నెంతవానినయినన్ గగ్గోలుగావించుచున్
మేలంబాడెదవీ పుమానవుని గంభీరైకధీయుక్తితోన్
ఆలంబందున జేయుఁడైన నృపహార్యక్షుండు జార్మణ్యభూ
పాలుం డెంతలో నేగతిన్ జనెఁ మునున్ భావింపనబ్రింబకున్

3

చనినారెందరొ రాజు లిప్పటికి, రాజ్యంబుల్ గతంబయ్యె, స
జ్జనులౌ పూరుషు లెందరిప్పటి కదృశ్యంబైరి నీ భూమి, స
న్మునిసంఘంబుల యాశ్రమంబు లెసగెన్ బూజ్యంబులై, యట్టులే
మనలన్ వీడెడిఁ దెల్గుతల్లి విసుగో! మాంద్యంబో! యే హేతువో!

౪

గతియించెన్ భువి పూజ్యులైన నృపవర్గంబుల్ యశఃకాములై
గతియించెన్ మరి కాకతీయ ప్రభుమణుల్ కాలప్రవాహంబునన్
స్థితకీర్తిన్ గని బాసె తిమ్మరుసు మంత్రిత్వంబునన్ గ్రాలుచున్
ఋతవాక్యయ్యు యుధిష్ఠిరుండు జనెనా బుధకోటి వీక్షింపగన్
బ్రతుకే దుర్లభమయ్యె నవ్యప్రభు సామ్రాజ్యాల వేయేటికిన్

౫

ఎన్నో రాష్ట్రములారెనీసరికి, నింకెన్నో గతుల్ దప్పె; ను
త్పన్నంబై యెనునూర్ల రాజ్యములు నిస్తంద్రోరువైశాల్యతన్
మిన్నున్ మన్నునుగానకుండ గరిమన్ మేల్కాంచి, ఖద్యోతద్యుతిన్
అన్నా! లేదుర కాలవాహినికి నిత్యంబెప్డు నిద్ధాత్రిలోన్

౬

కాలంబెంతయుఁ జంచలంబు, మరియే కాలం బొకేరీతిగా
హాళింబుచ్చుటలందరానిఫలముల్ వ్యాధుల్ జరామృత్యువే
వేళన్ దోడఁగు వచ్చునీడవలె పృథ్విన్ భాగ్యమా పాతమా
మేలుంగూర్చు మప్రేమ శాంతిగుణముల్ మేళంబుగావించుచున్.

౭

శ్రుతిసోమోదయ మెప్పుడౌను మరలన్ శోభాయమానంబుగా
స్మృతితారల్ వెలుగొందు నెప్పుడు ప్రశస్తిన్ జంద్రికల్ చల్లుచున్
గతులన్ దప్పక, దిక్కులందెపుడు ప్రఖ్యాతాంధ్రవిజ్ఞానమా
రుతముల్ వీచుసుగంధబంధురమహా రోదోంతరాళంబులన్

౮

లేరే రాజులు వర్తమానమున వారేమీ మదిన్ దాల్చరో!
సారాచారము లేమియున్నరుగరో! చార్వాకమున్ ద్రోలరో?
చోరానీకము నెల్లఁ జక్కడచరో! శోభన్ బ్రసాదించరో?
వారేరీతిని 'నాంధ్రరాష్ట్ర' గణన వ్యాపారమున్ 'బూనరో'
కూరారాతిచయంబుఁ ద్రోలరో? వెసన్ గూర్పఁగఁ గల్యాణ
ముల్

# బహర్ఝల్లి

## ౧

కాకతీయాంధ్రుల క్షాత్రంబు చెరలాట
విహరించి వెలిగెనీ బహారుఝల్లి
బౌద్ధధర్మరహస్య భాష్యసిద్ధాంతముల్
ప్రభవించెనీభూమిఁ బహారుఝల్లి!
నారసింగప్రావు కోరికంబము లెత్తెఁ
బసుల బౌధలమూన్పఁ బహారుఝల్లి
నానాశకుంతసం తానంబుస్వేచ్ఛమై
వసియించునీధాత్రిఁ బహారుఝల్లి

సకలసామంత క్షత్రియ నికరమెప్పుఁడు
లక్ష్మిఁదులతూగు చుందురీ రాజ్యమందు
అందములమల్లి, నిత్యకల్యాణవల్లి
ఝల్లులన్నిటిలోన వజ్రాలతల్లి
భాగ్యవల్లులఁ గొమరొప్పఁ బహారుఝల్లి.

# గణపవరపు కోటదిబ్బ.

౧

ఏ రాజరాజులు పూజసల్పిరొకొ ఆ హేరంబు నీ దిబ్బపైన్!;
ఏ రాణుల్ పవళించి యుండిరొకొ మున్నీ ధాత్రిహర్మ్యంబులన్
ఏ రాకన్నెలు శీర్షమందిడిరొ మున్నీ గర్భమాణిక్యముల్!
ఆర జన్యుల నెత్రికండలిట వమ్మై కాక చల్లారెనా!

౨

శ్రీకాకత్యనృపాలసింహములు మున్ గ్రీడించురంగంబులన్
తోకల్ పీఁగెడు గ్రామసింగములు హద్దుల్ లేక 'బౌబౌ' యనన్
పాఱన్ నేర్చిన వెట్లు దుర్భరపు రుప్పల్ దాటి దుర్గంధముల్
రాఁగన్ మానవుపో! విరించికృత దుర్వారంపు దుష్కాలముల్.

3

ఏ రావుల్, నవమల్లికాసుమములందీయంగ ముత్తైదువుల్;
గారాబంబున నాణిముత్తెపుసరుల్ లాజల్ ప్రవర్షించిరో!
ఆ రాగంబసలస్తమించెను గదన్నా; దిబ్బవాకిళ్లలో
తారాడెంగద పచ్చిమొండిచెవలున్; ధ్వాంతంబు తీండ్రించెడున్

౪

అదిగోఁ జూడుము! కాపుకన్నియలు వర్షాంతంబునన్ దిబ్బపై
ముదమొప్పారెడు లేఁతనవ్వులయ కెంపుల్ జారుక్రొంజేతులన్
వెదకన్ నాఁగిరి రత్నపుంజములకై వీక్షాద్యుతుల్ గ్రమ్మఁగా;
ముదిచేఁ జిక్కి నగొప్పవారికలుముల్ మోవానహం బేమగున్

## కూచిపూడి.

౧

శివునృత్యంబును ధిక్కరించుచును, గజ్జెల్ మ్రోఁత మ్రోయుఁ సదా;
పవలున్ రేయియు నాట్య‘దిందిమ’లు సంవాసించుఁ గూచిపూడిస
ద్భువి; నేఁ బ్రౌఢనునాట్యసుందరకళాస్ఫూర్తిన్ గుబాళించెడున్
అవురా! యంచును, లెస్స! యంచు నినునాహ్వానించునో ఆంధ్రుఁడా!

౨

చివురించున్ వడలాకుజొంపమయినన్; శ్రీమించి హేమించు, ని
ర్భవనంబైనను రాగవల్లరుల నుద్భాసించుఁ దాళంబులన్;
శివమెత్తున్ రసపూరితంబగుచు నిర్జీవాళియైనన్ వెసన్;
రవిబింబంబు ప్రతాపమున్ సడలునా గ్రామంపునాట్యార్భటిన్

౩

పారిసాత్రాజితిమందహాసకలనా మోహప్రభాడోలికా
పరిచేలాంచితలాస్యభంగిమలతో వాసించుఁ గూచిపూడినిన్
మఱవంబోకుమ నెన్నఁడైన యెడదన్ బ్రాల్మాలి. ఓ! ఆంధ్రుఁడా!
పరదేశీయులు, నాగరీకులగునా పాశ్చాత్యరాణ్మండలిన్
పరిహాసంబుల సేయుగాదె నటనాప్రాగల్భ్యమింపారగన్

౪

మోహోత్తుంగతరంగసంగతము, శంభుప్రీతనృత్యంబునన్;
ఊహాగానసుపానమత్తజన భావోద్రేకసంభూతమున్;

శ్రీహర దివియద్ధునీగమన సందీప్తస్వరప్రక్రియో
త్సాహప్రేరితసత్యపాత్రవిలసత్ సంగీతసాహిత్యముల్
కూహూమంజుల మాధురీప్లుతము, మాకూచూపూడి 'భాగో
తముల్

౨

ఏ దేశంబునఁ గానమీహారువు, మునీన్ద్రహస్తవిన్యాసమీ
పాదద్వంద్వవిలాసచాతురియు, నాస్వాదైకశృంగారము
న్నాదౌన్నత్యసముజ్జ్వలంబగు మహానాట్యోద్ధతిన్ జూడ ప్రా
చీదిక్సుందరి సేయునోము ఫలమా; చిత్రించు నాహా పుణ్యమా.

౩

ఉదయాశంకరుఁడుత్తనర్తకుఁడు, తానుత్సాహమే పారఁగా
హృదయాహ్లాదవిలాసడోలికల హాయిన్ జెందిముగ్ధాత్ముఁడై
ముదమొప్పారెడు స్వాదుగీతకలితా ప్రోద్యన్మహానృత్యమా
త్రిదశుల్ సైతము మెచ్చిరన్నతరమా? లెక్కింపమర్త్యాళికిన్

# హంపి - విజయనగరము.

౧

"మందారమకరంద మాధుర్యముల" జుఱ్ఱు
సత్కవిరోలంబ సంభ్రమంబు
గగనభాగమునంటు కలధౌత, గాంగేయ
జృంభితసౌధాళి డంబరంబు
భటయూథ, రథచక్ర భయదశుండాదండ
ఘీంకార, హయహేష సంకులంబు
పారిగ్రేశ, పాశ్చాత్య పరమహంసాచార్య
తీర్థసంవాసప్రోద్దీపితంబు
పరికృతిలావణ్యలాస్య ప్రభాసితంబు
"భువనవిజయాఖ్య" దర్పపరిపూరితంబు
భూరిగేహంబు, శ్రీజగన్మోహనంబు
"విజయనగరంబు" నగరకుభీకరంబు.

౨

ఏవంకఁజూచిన నిందిరామందిర
చందనగంధుల సరసగోష్టి
పతట్టుగసిన వాక్ స్వాతంత్ర్యమేపారు,
భూసురప్రకరసం బోధనములు

ఏవైపుఁ బరికింపఁ గేవలముగ్ధలా
పుష్పలావికల సమ్మోహగోష్ఠి
వవీథికేగిన నావంతఁ దీరని
రత్నవర్తకుల బేరముల యురువు
ఎచటఁజూచిన "కృష్ణ" శబ్దేతిహాస
వీరగాథలఁ రోదసింబోరుఁగొలుపఁ
బరగుఁ బ్రాచీనశాంగన భర్త్స్యశాల
విజయనగరంబు శుభముల విలసనంబు.

3

సురుచిరమాణిక్య శోభలఁదొలుదీవి
పద్మరాగైకసంపద్విభూతి
సరిలేని తెలిముత్తె సరులకరాటంబు
నానావిధారామ నందనంబు
శోభితసౌందర్య వైభవోపేతంబు
భాగ్యలక్ష్మినిఁజిమ్ము పట్టుఁగొమ్మ
శాంతనీరగభీర సరసులకావాల
మఖిలసద్విజకోటి కావరణము
కుడ్య, కుట్టిమ, తోరణ, గోపురంబు
మంగళాలయ, మయసభామంటపంబు

సప్తప్రాకారములమధ్య స్వర్ణపురము
విజయనగరంబు కల్యాణవిలసితంబు

౪

పారిజాతసుమాళి భూరిమాధురులొల్క
సత్కళారంగముల్ శాలలొకట!
మహితకాంచన మణిమయ వేదికలఁ గ్రాలు
సౌధసంభృతమహావీథులొకట!
పద్మరాగోపల ప్రాకారరుచులచే
వఱలెడు రాజ మందిరములొకట
రమణీయ సౌవర్ణ, రత్నభాండారముల్
రవణిల్లుకొలువు కూటంబులొకట!
లలితపీఠానదళవాయి కొలువుఁదీర
వంది, మాగధ, తూర్య కైవారములును
ఛత్రి, చామర, వేత్ర హస్తాళి వెలయు
విజయనగరంబు వైభవ విలసితంబు.

౫

గుండెల్ నీరగు, మేనుచాలవడఁకున్ క్షోభించుఁజిత్తంబు, హా!
గండూషీకృతభోగభాగ్యములతోఁ గన్పట్టునా హంపినిన్
జెండాడంగను శత్రుసేనలకు నాజిన్ జేతు లెట్లాడెనో!
భండారంబునఁగొల్లఁగొట్టిన సిరుల్ భావింపనో ఆంధ్రుఁడా,

ఆంధ్రి స్మృతి.

# కృష్ణరాయలు.

౧

ఏనాఁరోజులఁ బుట్టియుండినను నీకేమీశ్రమంబించుకన్
గానీకుండను దేశరక్షణకునై గావింపనాయుద్ధముల్?
ప్రాణంబొల్లక డాలుఁ గత్తిఁగొని వీరారాతులన్ దున్మనా!
పోనా! నీవగువీరభోజ్యమగు భూముల్ శ్రీలు కృష్ణప్రభూ.

౨

అనీతిమ్మరుసయ్యఁగాని రిపుసంహారంబుఁగావిఁచుచోన్
నేనామంత్రిసుతుండసూ! వలదుసుం దేహంబులోఁ గజ్ఞుఁడన్
నానాసభ్యతలందడంగుఘన విజ్ఞానంబు శోధించితిన్
వాణీలబ్ధవరప్రసాదకవితా భండారమఁదుంచినీ
న్నేనారాచముఁ ఎంటకుండగననా, హే! కృష్ణరాయాధిపా.

3

ఈకాలంబునఁదిర్గిపుట్టెదవునాకే వీఁకౌఱంతంచునే
నీకారుణ్యమహాదయంబునకునై నిర్వేదనల్ వొందుచున్
సాకల్యంబుగ వేచియుఁటినహహాముక్ సంధ్యా, నిశావేళలన్
వీకన్ భూమిమనీషివైవెడలు ముక్విన్ సత్కవిప్రీతిమైన్

౪

ఘటానాదము మ్రోగదా! దెసలఁ జుక్కల్ గాంతిఁ బెల్లుబ్బవా,
విఁటన్ వేగఁ బ్రసూనకాండమమరుల్ మేలంచు వర్షింపరా!

వంటన్ బాడినిఁ దెల్గువారలిక సౌభాగ్యంబులన్ మున్గరా!
కంటన్ గాంచునదృష్టముండినను నీకల్యాణకల్యాకృతిన్

౫

ఏమో! ప్రాయఁగలాఁడనంచుఁ గలమున్ జృంభింపనుత్సాహినై
మోమాటంబునొ, చిత్ర భీతినొ? కడున్ ముగ్ధుండనై తిన్ 'మహో
ద్దాముండౌ' భవదీయవీరరసగాథల్ వ్రాయుశక్యంబొకో?
ప్రామాణ్యాకృతిగా వెసీవు కదనవ్యాపార పారీణతన్.

౬

యవనారాతిజయోద్ధతిన్ దెలుఁగు మాన్యంబెల్లబీడౌట, స
త్కవులా పెద్దన, సూరనాదిబుధులే కానన్ బ్రవాసించిరో?
రవణాభ్యున్నతి ప్రోగునీవిజయ ఘంటారావమేమయ్యెనో?
నవలావణ్యమనోజ్ఞులౌ యనుఁగు గాంతల్ వోయిరె వ్చోటకో?
భవునక్షీణకృపావిహీనతను విభ్రాంతిన్ మనెంగు దెవన్

౭

సకలక్షోణిధవార్చితాంఘ్రియుగ! శశ్వద్వైభవోపేతమై
పరికేందుస్ఫుటచారుచంద్రికల మేలంబాడునీమూర్తికిన్
అకటా! యెంతటిదుష్టకాలమొదవెన్ హా! దేశదౌర్భాగ్యమో
వికలత్వంబుఘటిల్లెనో విధికినా వేళన్ మతిభ్రష్టతన్

౮

దేదీప్యంబగుఁ దివ్యకాంతిసొగసుద్దీపింపనీ దేహమా
పాదాంతము వీరరక్తముస్రవింపన్ గ్రూరశాతాసి, ము

న్నాదోర్దండపుళింద, బర్బర, కళింగవ్రాతముల్ చెందుచున్
పాదాక్రాంతముఁ జేయవే! సమరతైక్ష్ణం బొప్పఁ గృష్ణప్రభూ

౯

రిపుసంహారక్రమంబ! ధీవిభవమా! శృంగారవాల్లభ్యమా!
స్వపరీపాలనసూత్రనిర్ణయములా! సాహిత్యవ్యాసంగమా!
జపహోమాధికమా! కళానిరతియా! సారస్వతారాధనా!
తపసుల్ మెచ్చఁగ నందఁగాలితివి ముల్ ధర్మంబుఁ గాపాడఁగన్
నృపతీ! రత్నములందు మేరువగు నీ నేర్పెంగ శక్యంబొకో?

౧౦

“నావిష్ణుపృథివీపతి” ర్భవతినాన్ జ్ఞానుల్ ప్రశంసింపగా
నావాక్యార్థముఁ గృతిప్రమంబనెడి యూహన్ గల్గియున్నాఁడమున్
నీవిన్నాణము, నీదుశీవగుణ? క్షోణిన్ మర్త్యులెవ్వారికిన్
నీవాల్లభ్యము దైవచోదనమగున్ నిక్కంబు కృష్ణప్రభూ.

౧౧

విహరించెన్ దెలుఁగంబతా మిగుల శ్రీవిన్ నీదు వక్షస్థలిన్
రహిం నీదివ్యకృపాప్రవృద్ధఘనధారాటాళివోలెన్ మహా
మహులైమల్లన, రామకృష్ణులొక చెంపల్ నిన్నుఁ గీర్తింప భూ
వహనంబుల్ దలఁదాల్చి గెల్చితివి శోభల్ గృష్ణరాయాధిపా.

౧౨

కలయేమో! చిర వైభవాస్తమయ దుఃఖాక్రాంతకీలాలిమో?

విలయాభీలకృశానుతప్తహృదయోద్విభ్రాంతచిత్తంబొకో?
నలినీసంభవుమాయయో? ప్రకృతివిన్యాసంబొ? వేరేమొ? చం
చలమయ్యెన్ మృగతృష్ణవోలె భవదైశ్వర్యంబు కృష్ణప్రభూ!

౧౩

విలపింపన్ జని యేమి? విక్రమసరిద్వేలాపరీతోరుభూ
తలయంబున్నరచేతనిల్పితి మహావాల్లభ్యసంపత్తిఁ జేన్
విలసత్కీర్తి నిబొందినాడవనఘా! విశ్వంబు జేఁబట్టఁగా!
తెలుఁగున్ వారికినీ ఋణంబులవముల్ దీర్పంగ శక్యంబొకో?

౧౪

కలకాలంబొకరీతిగా జరుగదే తస్మాభర్తకున్ ధాత్రిలోన్
కలుముల్ లేములు శాశ్వతంబె భువి? మృత్యాయంబనాపాయమే?
తెలుఁగుంజవ్వనపుం మిఠారిగులికెన్ దివ్యప్రభన్ నీసభా
స్థలి నేప్రొద్దును పచ్చపచ్చగనురచ్చన్ గజ్జెమ్రోయించుచున్

౧౫

కర్ణాటుండవొ? ఆంధ్రభోజుఁడవొ? నిక్కంబెద్దియో గాని యా
కర్ణింపంబనియేమి? మా తెలుఁగుబంగారంబయెన్ నీకృపా
పూర్ణస్ఫూర్తివికాసముం గలిగియీ భూమండలిం దొల్లి, మా
వర్ణంబుల్ భవదీయదివ్యకళలై భాసిల్లెఁ గృష్ణప్రభూ.

౧౬

ఢంకాఁగొట్టుచుఁ జాటలేదె ప్రభు! మాశ్యధ్వాంతసిద్ధాంతముల్

బింకంబుల్ మరిచేతగాని నుడులుర్విన్ ద్రోసి మా తెల్గు సత్
పంకేజాక్షి యెలెన్నయంచు సభలన్ బ్రామాణ్యభాషాతతిన్ ;
శంకన్ దీర్చితివొక్కసారి ధరలో సారస్వత ప్రీతిమైన్ ;
న్యుంకారంబునఁబల్కుచుంటిమిసభాస్థానంబులన్ నిచ్చలున్.

౧౭

అష్టైశ్వర్యవిలాసభాస! నృపహార్యక్షుండ! మున్నీగదన్
ముష్టాముష్టిగడంగి శాత్రవశిరంబుల్ వ్రయ్యలంజేయు ను
త్కృష్టుండంచుఁదెలుంగువారలు నినున్ గీర్తించుధర్మంబొగిన్
భ్రష్టంబయ్యెగ నేడు, కాలగతులన్ వారింపసాధ్యంబొకో?

౧౮

చలితాంభోధిపరీతభూవలయ శశ్వత్కీర్తిచంద్రుండ, ని
శ్చలప్రజ్ఞుండవై మహీతలమొకేఛత్రంబుగా నేల మా
తెలుఁగుం దేశముధన్యజీవియయి ముక్తింజెందెనొక్కుమ్మడిన్
గలుముల్ కావడికుండలంచువిన నిక్కంబద్దియూహింపగన్.

౧౯

విధితానంతటికూరచిత్తుఁడొకో! నావిష్ణ్వంశసంభూతు, సు
ప్రథితాంధ్రేశ్వరుమొగ్గలోఁదునిమె,నిర్దాక్షిణ్యవృత్తిన్ మహా
వ్యథలన్ గుందెడినాంధ్రులిప్పటికి నైశ్వర్యంబుక్షీణింపగన్
మధలన్ జిక్కెడిఁదెల్గువాణినిక నే సూరుల్ప్రశంసింతురో!

౨౦

క్షణభంగురంబై, యశాశ్వతంబైన, నీ
యస్థిపంజర మెసూ యాహుతయ్యె
నా వాడపతి, శకందరనుత, భవదీయ
భౌతిక దేహంబె భగ్నమయ్యె
అఖిలార్థికోటిక్షుధార్తిఁ దీర్చిననీదు
మృదుతరహస్తమే మృత్తికయ్యె
అష్టదిగ్గజసమాభ్యర్చితచరిత, నీ
సుందరరూపంబె సొబగుఁ జెడియె

తేజుడిగ్గెనె నీకీర్తిదీపకళుకు?
మెఱయదే? మాత్రికోట్యాంధ్ర మేదినిపయిఁ
జే నెలా ల్కెడు విష్ణుచిత్తీయమందు
జూర! మృతజావి వౌదు దర్పాంధ్రకృష్ణ!

# సర్ విజయ.

౧

జీర్ణాంధ్రసామ్రాజ్య స్వర్ణకాంతులపునః
పరిభవింపఁజేసెడు భానుఁడెవఁడు?
అఖిలవేలాపరీతావని, క్రికెటునఁ
బేరొందిగెలిచిన వీరుఁడెవఁడు?
ఆగర్భశ్రీమంతుఁడై బుట్టి, ప్రౌఢిల్ల
నిజదేశసేవల నెమకునెవఁడు?
సకలభూపతులందు క్షాత్రంబుమెఱసిన
పూసపాట్కులమేరు పూసెవండు?
అట్టివిజయ రాజకుమార! ఆంధ్రభూప!
కరుడుగట్టిన శౌర్యాగ్ని కణములుబక
సమయమయ్యెను, బహుళాంధ్రజనముప్రీతి
సేనలుంజల్లుచున్నారు, శీఘ్రగతిని
ఉద్ధరించుమ ఖండితాంధ్రోత్సవంబు.

౨

రఘునాథుండుదయింపషోడశకళల్ రంజిల్లెతంజాపురిన్
సుఘనుండౌనరసింహకృష్ణకలిమిన్ శోభించెనాహంపి, మా
యఘముల్ బాపిసముద్ధరించుటకుఁ బుణ్యాంభోధివీ వేయనన్
రఘురాముంబలెబ్రోవుమయ్య, విజయా, రారాజవైనీప్రజన్!

3

సకలాశావృతదేశమెల్ల నెమకన్ క్ష్మాపాలవర్గంబులో
నొకఁడైనన్సరిరాకపోఁడెడిభవద్వ్యూహంబులన్ యుక్తుల

అకలంకంబగు దేశభక్తి జనిత వ్యాపార మేపారగా
నికరంబైన తెలుఁగుబిడ్డవుసుమీ నీకున్ జొహారుల్ ప్రభూ!

## రాధాకృష్ణ.

౧

ప్రాచీనార్యులభూరిధీవిభవమర్వాచీన విజ్ఞానముం
వాచస్పత్యజగీష ప్రాగుపనిషత్ వాగర్థపీయూషమున్
దాచన్ రాకను వేంగిభూస్థలిని, రాధాకృష్ణభూమీజమై
లేచెన్; పుల్లప్రసూనసంపదలు ధాత్రిన్ జిమ్మె నెత్తావులం;
గాచెం శాఖలభవ్యదివ్యఫలముల్ కందోయిపర్వంబుగాం
బ్రోచెం దండిక; ఆరగించుడలయాంధ్రుల్ నిర్జరప్రాప్తికై!

౨

పలుచనిమైఁదీగె బ్రాగైనరూపంబు
విశ్వమోహనతను వెలయువాఁడు
వినయసౌశీల్యాది గుణములపుంజంబు
వాగ్దేవినాలుకన్ వఱలువాఁడు
ఖండఖండాంతర పండితమండలా
ఖండతేజఃకీర్తి మండితుండు
ప్రాక్పశ్చిమాఖ్య విశ్వంభరావలయను
ప్రౌఢవిజ్ఞాన సంపద్ధురుండు

ఉపనిషత్తులసారంబు నుమిసినాఁడు
ఏడుదీవులగంధంబు లీనినాడు
బ్రహ్మవిద్యనుసీమలోఁ బంచినాఁడు
చనవుగలవాఁడు, సత్త్వతేజంబువాఁడు
కులము, దర్పంబు గలిగిన తెలుఁగువాడు!

3

తోరంబైనయఖండితాంధ్రమహీసంతుష్టాంతరంగంబు లిం
పారన్ మంగళకాహళధ్వనుల నిర్నాలాపముల్ చేసెడిన్
ఘోరంబంచుఁదలంచకీవు జననీభాగ్యంబు జృంభింపగా
దారింజూపుము భగ్నులాంధ్రులకు సత్యంబైనమార్గంబునన్!

## టంగుటూరి.

౧

సర్వస్వంబునుగోలుపోతివహహా! 'స్వారాజ్య' సంపాదనన్
దుర్వారోద్యమయజ్ఞకుండమున బుద్ధిన్ వోలె;బితూర్థివై
యుర్విన్ మెట్టితి వెండనీడనక నీవో! ఆంధ్రసత్కేసరీ
గర్వస్ఫూర్తి వెలుంగునిచ్చలు తెలంగాణంబునీమూర్తికై

౨

ఆపాదశీర్షపవిత్ర్యణువు భాగమునందు
స్వచ్ఛాంధ్రరక్తంబు జాలువాఱ

పలుకుఁబల్కఁడెల్లుఁ బ్రాగల్భ్యములరొదల్
నిగమనాదములట్లు నివ్వటిల్ల
ప్రళయబాంబునుగూడఁ బరిహాసమునుసేయు
గుండెధైర్యము మేను నిండఁబొంగ
భ్రష్టాంధ్రసామ్రాజ్య భావిభాగ్యోదయ
దినకరత్వంబు మూర్తీభవింప
గుహనువెడలెడుసింగంపు గోఁటువాఁడు
కపటమెరుగఁడు; కల్లలన్ గైకొనఁడు
'తమిళుఁడై' నను వాని తాతయునఁగాని
చీకికిఁగొనఁడు మనటంగుటూరి బుధుఁడు.

3

సతికిం జెప్పఁడు, సోదరావళినివీసంబైనఁ బేర్కొఁడు, స
త్సుతులన్ జీరఁడు గవ్వకైన, మరిమిత్రుల్ నైతమీక్షింపఁడే
గతినైనన్ నిజదేశదాస్యలయకైంకర్యసంరంభుఁడై
యతివోలెన్ జరియించుమాతృచరణధ్యానైకలోలాత్ముఁడై

4

సుతుకంబందెడి నెమ్మనంబు, భరతక్షోణీమహామాతకున్
వెతలందీర్పఁగ జాలుస్వర్ణఘుటికల్ వేంచేసెనా! మంత్రివై
అతులప్రాభవవంశధీవిభవమాహారించి చాణక్యువై!
ధృతిస్వారాజ్యశుభాక్షతల్ చిలుకుమాంధ్రీగర్భముల్ పండగన్

# ఆంధ్ర స్మృతి.

## బాపిబావ.

కవటాకుఁ బసమించుశోభలు, నవాఘ్రాతైక సౌరభ్యముల్
కవిగానోజ్జ్వలపుష్పపుంజ లసదాంధ్రారామసీమాళిలో
ధ్రువతాళంబులనీదు 'తొల్కరులు' 'గోధూళుల్' 'సదా పాడు మో
నవకేకీ! నుతబాపిబావసుకవీ! నవ్యాంధ్రసద్భారవీ!

౨

ఒకయాంగ్లేయుఁ బ్రశస్తమిత్రతను నెన్నోనూత్నరాగంబులన్
బ్రకటింపన్ గాలికోడిఁ గూసితివి, మందస్మేరముల్ జింద నా
గృకవాక్కున్ స్వనమొర్వడయ్యె. మన వేంగీరమ్యచిత్రంబులన్
ఇకశిల్పీ! మురళించునీమురవళుల్ హిందాంగ్లదేశంబులన్!

3

కవిసూరన్ననుసంస్మృతిం దవులగాఁ గాఁబోలుఁ జేయుంచె, మూ
డవిస్వర్ణామలరత్నహారములు, దివ్యంబైన కేంపీనె; నా
చవులీనాడురుచింపనేరవని శశ్వన్నవ్య సాహిత్య, సం
భవ 'నారాయణరావు' వ్రాసితివిసుధా వాక్సారమేపారఁగన్

౪

ఈచైత్రోదయవేళ భాగ్యనగరిన్ హేమంతముల్ విచ్చనీ
వాచాళిత్వమెహాయసాన్నముగ సంభావింతురీలోకాళి, నీ
పారిచర్యంబున నేమిఁ దెల్పెదవొ, నిద్రాణాత్ములాంధ్రాళికిన్
నీచైతన్యముఁ గొంతఁ బంచదగు సందేశైకశంఖార్భటిన్.

[నోటు:— 25-10-45 వ తేదీని "మీజాన్" పత్రికలో ప్రకటింపబడినవి.]

## కందుకూరి.

౧

ధ్రువనక్షత్రము కందుకూరి గురుఁడా ద్యోమండలంబందునన్
నవలాగ్రంథములా! పరిహాసనములా! నాణ్యంపుఁగావ్యంబులా
అవినీతిన్ వెసఁద్రోలు హాస్యకథలా! హాక్షప్రబంధంబులా!
భువి నెన్నో రచియించి గ్రాలెఁదొలి, సంపూజ్యుఁడునాంధ్రాళికిన్

౨

పతితహిందూజాతి గతులను దిలకించి
పరితపించిన దయాపరుఁడెవండు
మాతృగర్భముఁగ్రుంగ మాటికి విలపించు
బాలవితంతుల ప్రాపెవండు
ఘోరదురాచార కటజకాంతారంబు
ఛేదించె నెవ్వాఁడు చేగ మెఱయ
సకలశాస్త్రపురాణ సంహితాభ్యాసుఁడై
యుపనిషత్సారంబు నూఁదె నెవఁడు
బ్రాహ్మధర్మంబున దెసల్ బంచె నెవఁడు
అట్టిపుణ్యుండు, కందుకూరాన్వవాయ
భవ్యగుణశాలి, రాజమండ్రిపద్మహేళి
సూరిమాత్రుండె వీరేశ భూరియశుఁడు.

3

మితభాషి, లాక్యుండు, హితవాది, మృతజీవి,
మానవసేవలన్ మసలినాడు
కర్మనమ్మనివాడు, కార్యాభిరతి మొండి,
విధినిర్వహణమున విసుగుజడుడు
విప్రికులమువాడు, వేదముఖుడుగాడు,
బ్రిహ్మగీతములెల్ల బాడినాడు.
కవనమల్లినవాడు, కథలజెప్పినవాడు
కాలరీతులనెల్ల గాంచినాడు
నెన్నపూసమనసు, విన్నదనములేదు
గద్యరచనదారి గడగినాడు
కాళిదాసకవులకావ్య షట్కులకెల్ల
తెల్లుదోహదమిచ్చి తీర్చినాడు.

4

పీలకాయము వాడు, పేరురంబులవాడు,
పటుదర్పమునుజూపి ప్రబలినాడు
చిరునగవులవాడు, చీరాకుగలవాడు,
కఠినవిమర్శనల్ గడగినాడు
దాక్షిణ్యమెరుగని దక్షతగలవాడు
ప్రిజ్ఞులలోనెల్ల బామరుండు

ఉద్యోగులకుమంట, సద్యోగులకుఁజంట
చాటుబేరములన్ని చాటినాడు
పెంకెతనము మెండు, పెద్దలలోఁ బెద్ద
పిరికితనము లేని పెద్దబుద్ధి
అర్థప్రాణములను నాంధ్రదేశముకయి
సర్వమిచ్చినట్టి సాహసుండు.

౫

కాలమీదిన వాడు, కాలుఁదీయని వాఁడు
కాలగర్భమునంతఁ గాంచినాడు
ప్రజ్ఞఁ గోల్పడ లేడు, ప్రజ్ఞఁ బల్కఁగ లేదు
పరహితకార్యముల్ మరగినాడు
పురుషకారము వాఁడు, పొడిమాట నెరుగఁడు
పూర్వస్మృతుల నెల్లఁ బోరినాడు
విద్యనిచ్చిన వాఁడు, విద్యనందిన వాఁడు
మొక్కవోవని ధైర్య మూనినాడు
పదములొత్త లేడు; 'బహదు' రందిన వాఁడు
శబ్దచయము నెల్లఁ జదివినాడు
రచ్చకెక్కినాడు; రచ్చఁద్రోలిన వాఁడు
రాజమహేంద్రపురపు రాజమౌళి.

## ఆవచితిప్పయం.

ఆవచిందిప్పయపాటనాక్షరము లన్నాలించి తేయాంధ్రి! స
త్స్వవచఃశీలుఁడు. శేము షీవిభవుఁడుఁ దాత్మ్రత్వమాంధాతయుఁ
కవిలోకాన్వయరమ్య హేళిముసుఁదాఁగ వించె వ్యాపారముఁ
సువిశాలాత్త విదేశ బేహారులతో; శోధించెనాంధ్రపత్రికల్.

## దర్శనము

౧

ఇలగాంధీయుగ మేగుదెంచెఁ, గనన య్యోఁ నేడ మా దాస్యశృం
ఖలముల్ బాయఁగ; వేగుఁజుక్కలలనాకాశంబునఁ గ్రాలెడిఁ
విలసన్మోహనపిశ్వఁగాన చరకా వేణుధ్వనిడౌ సూతుఁడై
వ్యలకోఁదోలుచునుండె స్యందనము శోభన్ జూడుమో! ఆం॥

౨

అదిగో మాత! జగద్విధాత్రి యదిగో! హైమాంబరస్ఫూర్తితోఁ
దిరిదశాధీశ్వరులెక్కలన్ వెలిఁగెడున్ దేజఁబుఁదీపింప, న
య్యుదయాస్తాచలసేతుశీతనగ మధ్యోర్విన్ విడంబించి, పె
న్నదసారించెడు భీషణాకృతిని; మాంగల్యప్రభ భాసురా
స్పదమా మూర్తికినాంధ్రపుత్రుఁడనమస్కారంబుఁగావింపుమా

3

జయగీతంబుల మేళవించి మురళీసంజాత గీతోర్మి ని
ర్భయతన్ గ్రోలుచుఁ గీర్త్యలంకరణ సౌభాగ్యంబులఁ బొందుఁడీ!
రయమొప్పారఁగ మాతృశీర్షమున మొల్లల్ మల్లెలన్ జల్లుఁడీ!
ప్రియముం గాంచుడి రాష్ట్రసిద్ధి! జననీ ప్రేమాతిరేకంబునన్

## ఉపసంహారము.

౧

ఈలావణ్యమయప్రపంచమున నే డోలాలతాసూనమై
లీలాసృష్టివినోదముం గనుచుఁ గేళీలోలలీలుండవై
వాలాయంబుగపొద్దుపుచ్చుముసఖా! వైషమ్యరూపంబునన్
ఏలాగుంజెదుమాటికిన్ ప్రకృతిసాన్నిధ్యంబుఁ గాంక్షింపుమా.

౨

నలినీపత్రవితానముంగనుచు నానందాంబుధిన్ మున్గ మం
జులసారంగముబొల్చు నెప్పగిది, నాశోభన్ విలోకించుచున్
పులకాంకూరపుక్రొమ్మయుంగడరనే పూఁదోటగంధంబునన్
గులుకొప్పంగమునింగి తేలుమనఘా! క్రోధంబదేలామదిన్.

3

ఎన్నాళ్లీరసహీనమైనబ్రతుకీ హేయప్రపంచంబునన్
ఎన్నాళ్లీస్వకులాభిమానమును వీడీవీడకన్ డాగెదన్
ఎన్నండంబరవీథి, స్వేచ్ఛవలపుంబింపిళ్లుఁగూయన్ పవల్
ఖిన్నత్వంబునువీడి, జొత్తుదివిషత్ ప్రేమైకహేవాకలన్?

౪

చివురుంజొంపపుగండుకోయిలల యాశీర్వాద గానంబులున్
జవులంజిప్పిలుబొండుమల్లియలవా సంతైకసౌరభ్యముల్
జవనంబీనుమితారికత్తియలతే సౌరొల్కుసౌందర్యముల్
కవులెవ్వారికిజీవనామృతము, తత్కాంతిన్ విడంబించుమా.

౫

అలక్రొక్కారుమెఱుంగుదీఁగియల నుయ్యాలూగు మేఘంబులన్
ప్రళయాంభోధరముక్తసాంద్రవిలసత్ పాథోధినీరంబులన్
కలహంసీపిక, శారికావళుల దీర్ఘారావ నృత్యంబులన్
జలువల్ జిమ్మెడుఁగమ్మతెమ్మెరలవాసంబుండుమా! సఖా!

## ఆశీస్సు.

౧

కళలంజీరుచుఁగావ్యమేళములతోఁ గల్యాణగీతార్భటుల్
విలసిల్లంగనుదిక్తటంబుల మహావిశ్వంభరామండలిన్
గలుముల్ జిమ్ముచు రాజలోకములు మ్రొక్కన్ సూళిపాదాబ్జముల్
తెలుఁగుందల్లి మఱొక్కసారిఁ మనునా! దీపింపన్ తేజంబిలన్.

౨

దాక్షారామము, కాళహస్తియును, భక్తప్రీత శ్రీశైలమున్
అతుల్యంబుగ మూఁడులింగములు ప్రాపై యాంధ్రసామ్రాజ్యమున్
రక్షింపంగఁ ద్రిలింగమాతమఱలన్ రంజిల్లుభోగంబులన్
శిక్షంబొందెదరాంధ్రరాష్ట్రవిముఖుల్ సిద్ధంబుసుమ్మాంధ్రుఁ॥

3

అమరగానముపాడి యఖిలభూవలయమున్
ఱేఁగించునాంధ్ర వాల్మీకిమునులు
“పురవీథినెదురెండపొగడదండల” నిడి
నాటికీర్తిఁగొను శ్రీనాథకవులు

సేతుశీతనగాల శాంతాసిమ్ములిపించి
జిష్ణుత్వమూనఁగాలు కృష్ణవిభులు
సచరాచరజగంబు స్వచ్ఛాభ్రగీఁతల
వెలిగించునాంధ్ర రవీంద్రపిధులు
సంభవంబుకాగలరు నిస్సంశయముగ!
కర్మభూమికఁటంగలదె? ధర్మి కాదె?
విశ్వసాహిత్యజగతిఁగా వ్రేలుమడియు
స్వర్ణదినములభూరి స్వచ్ఛందయుగము
తిరుగఁగాంతువు! లేలెమ్మ! తెలుఁగుబిడ్డ!

౪

మారాష్ట్రంబురమాసరస్వతులు సంబాళించుసమ్మోహ నాం
ధ్రారామంబయి, శారికా శుక పికాలాపప్రతిధ్వానమై
వీరవ్రాతసమార్చితాంఘ్రియుగమై విశ్వాపణక్షేత్రమై
పారావారగఁభీరమైవెలయు సప్తద్వీపమాణిక్యమై.

౫

ధరణీరాజ్యము రామరాజ్యమయి, నిస్తంద్రప్రభన్ గ్రాలెడిన్
నరులెవ్వారికిసస్యవృద్ధికయి వానల్ కుర్యుఁగాతన్ సదా!
సురలోకంబయి "భారతావని" మహాశోభన్ ప్రవర్తిల్లెడున్
చిరకాలంబుప్రవృద్ధులైమనియెడున్ హిందూముసల్మానులున్
పరధర్మంబుభయావహంబుతొలఁగన్ బ్రార్థించుమో ఆం॥

మంగళం మహా శ్రీ.

# పరిశిష్టము

## భక్తులు.

౧

కంచర్లగోపన్న కథ నెఱుంగనితెల్గు
　　వాఁడాంధ్రుఁడా శుద్ధమోహు గాని,
భద్రరాముని సేవ లారగింపెఱుగని
　　వాఁడాంధ్రుఁడా పట్టిబీడుగాని,
వేమన్న యోగీంద్రు నామంబుఁదలపని
　　వాఁడాంధ్రుఁడా గట్టిపాడుగాని,
గౌతమిఁగనుఁగొన్న పూతునిట్టల దాసుఁ
　　భేరెఱుంగనివాఁడు పెద్దరాజు
కుసుమహారనాథు సేవలఁ గొసర నేల ?
చాలు! సాయిబాబాకు 'జై, జై' లనుమనవి !
గొడ్డువడెనె! భక్తులకు మాగడ్డ తెలుఁగు?
తల్లినొకసారి మనసారఁ దలఁచుమాంధ్ర.

౨

వినుతలీలాశుకుఁ బిల్వమంగళుభక్తిఁ
　　జవిఁజూడనాంధ్రుని జన్మమేల ?
భరతనాట్యప్రౌఢిఁ భక్తిరక్తులఁ జిమ్ము
　　సిద్ధేంద్రయోగి ప్రసిద్ధిచనెనె ?

కాసులపురుషోత్తమేసు కేశ్వరుఁగొల్చె
    నాంధ్రవిష్ణువె త్రిలింగాధిపుండు
ఓత్తరాహులకెల్లఁ బత్తి నేర్పిన తెల్గు
    క్షితిని రాధాస్వామి గీతలటర!
గొడ్డువడెనె భక్తులకు మాగడ్డఁ దెలుఁగు!
భౌతికాధ్యాత్మికాది సంపత్తులంది
భక్తి, వైరాగ్య జ్ఞానంబుఁ బ్రబలఁజేయు
తల్లినొకసారి మనసారఁ దలఁచుమాంధ్ర.

3

ముప్పదిమూఁడుకోట్ల సురముఖ్యులుఁగాక దశావతారముల్
తప్పలు[గ్రామదేవతలు; కో! యనవత్కొఁడనార్యభూతముల్
దెప్పలు; చాలవా? దిగుమతిఁ మరిఁ జేయుకు ముత్తరాది దే
వప్పలఁజీరికైన పెఱవారలునన్వరె వెత్తియాంధ్రుఁడా.

౪

ఆస్తిక్యంబునుగాంచవోయియనఘా! ఆసేతునిరాణ్మండలిన్
పరిస్తుత్యంబు వెల్గువాదివలుపుల్ సైతంబునొక్కమ్మడిన్
పరిస్తావించెడి, నేకమద్వయమునో బ్రహ్మంబునా సూత్రముఁ
పరిస్థాపించుచు మోక్షమున్ గనుమవే బ్రహ్మైకసంధాత్తవై.

# కలగూర

౧

నన్నయ, తిక్కన్న నామంబులనుఁ ద్రోసి
బెంగాలిబాబుల పేరులేల?
నవ్యాంధ్రసాహిత్య నవనీతమును రోసి
హిందీకవిత్వంపు టెంగిలేల ?
సకలౌషధపురాజు మకరధ్వజముఁ బాసి
హేమగ్లోబినుసిరప్ లేలనీకు ?
అఖిలప్రజ్ఞాన్వితు లాంధ్రరత్నములుండ
గుజరాతుదేవుళ్ల భజనలేల ?
ఆంధ్రభాషకు వేనవేలంకెలుండ
రోమనంకెలసింగార మేలనీకు?
పొంగిపోదువు పొరుగింటి పుల్లకూర
కంధకారమువీడి శుద్ధాంధ్ర మెరిగి
తల్లినొకసారి మనసారఁ దలఁచుమాంధ్ర!

౨

కమ్మనిచేఁబ్రోలు గుమ్మపొగాకుండ
'ఫారినుసిగరెట్ల కోరికేల ?
'గోదావరి' లంక కొటాకుపండంగ
'టాజ్ మహాల్' బీడీల మోజులేల ?

అందచందములిచ్చు నాంధ్రవస్తువులుండ
'జాపాను' చికిలీ సరకులేల!
అఖిలబాధలకు సిద్ధామృతాంజనముండ
'జర్మను' తైలంబుఁ గర్మమేమొ?
పెరటిచెట్టు మందుకురాదు. ప్రియముఁగాదు
తప్పునీదాన? కూడనాథా తదాను?
అయినకర్మమయ్యెడి! నికనైన నీవు
తల్లినొకసారి మనసారఁ దలఁచుమాంధ్ర!

## 3

సాయనభాష్యంబు చచ్చిపోయెనెభువిన్
"మోక్షమూలరె" నీకుముక్తియటర!
మల్లినాథునిటీక మహిమగోల్పడియెనే?
'షేలియమ్ము'. 'గైటీల' వృత్తులేల?
భవభూతినాటక ప్రాభవంబాఱెనే?
'బర్నార్డుషా'పైని భ్రాంతియేల!
తర్కశాస్త్రగురుండు తాతఅన్నమభట్టు
విడిచి "బోశాంకో"లఁ దడవనేల?

అనుపమానవిశాలాంధ్రభూమిఁ
గడనకెక్కిన విజ్ఞానఖనులుగలరు
అలమనోవీథి భావదాస్యంబుమాని
తల్లినొకసారి మనసారఁ దలఁచుమాంధ్ర!

## — గద్య —

ఇది శ్రీమత్ హారితస గోత్ర పవిత్ర, రాయప్పేశ్వర
పౌత్ర, సూర్యనారాయణ మూర్త్యమాత్య పుత్ర,
మంగమాంబా గర్భ శుక్తి ముక్తాఫల,
సుకవిజనవిధేయ.

శ్రీ 'రాజరాజేశ్వర' కరుణాప్రసాదలబ్ధ కవితాభాసుర
క్రొవ్విడి వేంకటరత్నశర్మకవి— ప్రణీతంబైన
“ఆంధ్రస్మృతి” ఖండకావ్యమందు
సర్వము సంపూర్ణం.

# ఆంధ్రస్మృతి

## (పూర్వభాగము)

---

## మాతృస్మృతి

౧

మాతృదేశమ నిన్ను మఱచి పోగలమె
చవులూరు నీనామ శ్రవణమాత్రమున
భావములెన్నెన్నొ పరిఢవిల్లెడిని
సంతతానందంబు సంభవించెడిని॥ మాతృ॥

౨

బ్రతుకగలండెయీ క్షితినెవ్వడైన
కంఠాన ప్రాణంబుఁ గ్రాలునందాక
ఆదినాదు దేశం బయిదియె నాయూరు
అనిపొంగకుండునే మనుజుఁడెవ్వఁడును. మాతృ॥

౩

సురభిళనీనామ, స్మరణమాత్రమున
దుఃఖపరంపరల్ తొలగిపోకున్నె
ఝూమ్మని యేఁటి ఝంఝామరుత్తునకు

దూదిపింజలఁబలె తేలఁగి వేచనవె
చిరకాలమునుండి చేయుపాపములు
తన్మయత్వంబుబొందదె శరీరఁబు
పులకరించదె, గగుర్పొడవదే మేను, మా॥తే॥

౪

వనకోయిలలకుహూస్వరములకన్న
నూనరాజిస్రవించుఁదేనెలకన్న
నేత్రపర్వంబునై నెగడుమందార
విరజాజిమల్లెల సరసిజంబులను
అనయంబుస్ఫురింకార, స్వనములచేత
కమ్మపుష్పాళ్లను గాలితేనెలను
గ్రోలెడుబంభర ఋతములకన్న
శారదచంద్రిక, చలువలకన్న
మధురత్వమునవొప్పు మామిళ్లకన్న
కీరభాషలకన్న శారికకన్న
పిండారబోసినట్లుండు వెన్నెలను
గాసెడుజాబిల్లి కన్ననునీదు
పావననామంబు బలుకుమాత్రమున
జన్మకుగలుగవే సకలసంపదలు

కవులకుఁబుట్టవే కవనధోరణులు
సంగీతమబ్బదే జడులకునైన
అబ్బదే స్వర్గసౌఖ్యమ్ము నిమ్మహిని. మాతృ॥

౪

జిలిబిలిపలుకులఁ జెన్నలరారి
తండ్రికెప్పుడును సంతసమునుగూర్చ
ముద్దులబిడ్డని మురిపెంబుకన్న
ముంచునీనామంబే మోదవారిధిని మాతృ॥

౫

అనుపమసౌందర్యమునగ్రాలియుండి
వాసిగాంచినరతిఁద్రోసిరాజెడు
చందమామహసించు సతిగల్గియున్న
ముంచునీనామంబె మోదవారిధిని. మాతృ॥

౬

అమెరికాకేగిన నబ్ధిదాటినను
ఆఫ్రికాకువలస యరుగుమాత్రమున
నీదునామముకాదె నిత్యజీవనము
సీమకేగిననీదు, సేమమేనరతు. మాతృ॥

౭.

ఇతరలోకముతోడ నేటికేనాకు!
క్షణభంగురంబైయ శాశ్వతంబైన

జలబుద్బుదంబైన జన్మంబునమ్మి
మోసపుత్తుమెనిన్ను మురిపెంపుతల్లి. మాతృ॥

౯

ఎచటకేగిన మరియెందుడాగినను
చాటమేనీకీర్తిసాంద్రచంద్రికల
విలపింపగావద్దు విలపింపవలదు
మాతరో! నీపేరుమంచిబంగరున
లిఖియించి మెడనుదాల్చెదననారతము. మాతృ॥

౧౦

చల్లారగాలేదు చల్లారలేదు
రసపుత్రవీరుల రణప్రతాపాగ్ని
కరఁగిపోలేదింకకరఁగిపోలేదు
కాకతీయులరక్తకరుడులిప్పటికి
మఱచిపోలేదింకమఱచిపోలేదు
నరసింహకృష్ణు నానాచమూధాటి
ఘోరసంగ్రామంపు వీరకృత్యముల. మాతృ॥

౧౧

ఉడుగలేదింకనూ యుడుగనేలేదు
ఆంధ్రచాళుక్యుల యర్హవిక్రమము

మహి నెందుఁగలదెపో? మహి నెందుఁ గలదు?
బొబ్బిలి వెలమల భుజపరాక్రమము. మాతృ॥

౧౨

ఆరిపో లేదింక నారిపో లేదు
తెలుఁగుకత్తులనుండు దివ్యతేజంబు
అవిరళభస్మంబు నందున్నయట్టి
అగ్నికణంబుల ననుకరించెడిని
ఆంధ్రుల శౌర్యంబు లంతట నేమ. మాతృ॥

౧౩

చండప్రతాప మార్తాండునిఁబోలు
ఘనప్రతాపుని కేది కాపురంబలను
భోజభూజానిబోల్ రాజనరేంద్రుఁ
గీర్తి కాంతకు నేది కేళికాసీమ?
పలుమారు పరులను భండనంబందు
దర్పమడచిన రుద్రమదేవియె చట
వసియించెఁ జెలువును వహియించి తొల్లి
ఖడ్గతిక్కన కత్తి కాకకోర్చకను
పటువీరులైనట్టి పరిపంథిజనము
కాళ్లకు బుద్ధులఁ గరపిరెచ్చటను. మాతృ॥

ఆంధ్ర స్తుతి.

౧౪

"దేశభాషలయందు తెలుఁగదిలెస్స"
మనభాషఁబోలెడు మధురంపుభాష
గాలించి వెదకిన గలదెయెచ్చటను
అదియాంధ్రులకును చుక్కెదురయ్యెగాని. మాతృ॥

౧౫

నన్నయకవనంపు విన్నాణసొంపు
తిక్కనకవితలోఁ దేటభావములు
బమ్మెరపోతన్న భక్తితత్పరత
పింగళిసూరన్న పెనుభావగరిమ
తాతగారైన పెద్దన్నయల్లికయు
పాండురంగకవీశుఁ బద్యంపుహారువు
ముక్కుతిమ్మనబుధు ముద్దుపల్కులును
ఆంగ్లకవీశ్వరు లందెందుగలవు. మాతృ॥

౧౬

ఆంధ్రరాష్ట్రంబఁచు ఆంధ్రోద్యమమని
అఱచెదుమాటికి ఆంధ్రపుత్రుండ
ఆంధ్రుఁడవయ్యు శుద్ధాంధ్ర మెరుఁగవు
తెలిసికోలేవు నీదివ్యశక్తులను
అఱపులుమాని ముందంజలు వేసి
కార్యశూరువుగమ్మ గైకొమ్మదీక్ష. మాతృ॥

ఆంధ్రి స్మృతి.

౧౭

కన్నుగానక నిన్నుఁ గనలేకపోతి
మాతకోనీపట్ల మానభావమును
వహియించియుంటనే పాపుండనైతి
కాలునిబంట్లువే కలవచ్చెడిని
భరియింపగాలేను బాధలనేను, మాతృ!!

౧౮

అంజలిఘటియించి యర్మిలిఁ మొక్కి
మరిమరిస్మరియించి మాతరోనిన్ను
హార్దానసీలోన నైక్యమొందెదను
సంపూర్ణ సౌఖ్యంబు సతతంబుఁగోరి
మునిఁగిపోయెదనింక మోదవారిధిని
మాతరో ఆశీస్సు మహినిమ్మనాకు
"ఆంధ్రివిష్ణుస్వరూపాయ" శుద్ధాయ!
మాతృదేశమునిన్ను మరచిపోగలమొ? మాతృ!!

గ్రంథాలయ సర్వస్వము...
నాలుగవ సంపుటము—
మొదటిభాగము... 22–10–1919

# ఎపుడు దేవ!

౧

భానుకిరణోపహతికిని పరిఢవిల్లి
తామరపుటాకునవసించి తళ్కుమనుచు
ధవళ కాంతులఁబఱపు ముత్యంబుఁబగిది
అందమునఁగ్రాలు పెనుజల బిందువగుచు
ఎపుడుపుట్టెదనింక, యింకెపుడు దేవ!

౨

వరశరత్కాలవికసిత పద్మమందు
దీక్షసంగీతరసమునఁ దేలియాడి
మోదవార్ధినిమున్గి పుష్పాళిఁగ్రాలు
మధురమధువులఁజుఱ్ఱెడి మధుపమగుచు
.... ఎపుడు ...

౩

మావిచివురులమెక్కుచు మలయపవన
మునకుపక్షంబులల్లార్చి ఘనవిపంచి
కాస్వరసమాన సుమృదుకు హూస్వరమున
గానముంజేయుసమదపికంబనగుచు -
... ఎపుడు ....

౪

౪

చండమార్తాండు డెండమనుద్దండగతిని
మండుచుండఁగఁదాపంబు మాన్పుచుండి
పసులుమెసఁగెడి కసవును కొసరికొసరి
ఊఁచిపీచెడుమంద వాయువులఁగూడి–
... ఎపుడు ...

౫

సంజకెంజాయరాగ ప్రసారమునను
జిలుఁగునవ్వులకలుములఁ జిమ్ముచుండి
పాటలాధరిమవ్వంపుఁ దేటయగుచు
తేనెసోనలఁజిప్పిలు సూనమగుచు –
.... ఎపుడు ....

(నోటు:- 1920 సం॥రం లో " కృష్ణా పత్రిక " మొదలగు పత్రికలలో ప్రకటింప బడినది.)

## వేడుకోలు.

### హిందూస్థాని — చాపు ....

౧

అందమగు మనవిశ్వనాథుని—మందిరంబులఁ బాడుకొందము
సుందరంబగు మేను మెఱయుఁగ—విందొనర్చెడు భావగీతల. అం॥

౨

ఉపనిషత్తులు,తపసిజనములు—విపులహృదయులు, యోగులు,
జపతపంబుల నేపరాత్పరు—నపరిమితముగఁ బల్కుచుందురు అ॥

3

సాంధ్యరాగము మెరయుచుండగ—సాధుపుంగవు లెందరెందరొ
సంధ్యవార్చు రేనుహోమహాలు—వింధ్యపర్వతసీమల. అం॥

౪

చీమదోమలఁ, జెట్టుపుట్టల—రామణీయక మైన, యా
రామసీమల, సోమసూర్యులఁ —ప్రేమనుమముతో నిండి
యుండెడి. అం॥

౫

తరులతాదుల, గిరులఝరులను—శరళతారల, సరసిజంబుల
వఱలుచుండెను సరళమూర్తి ని—సరసమృదువర కీర్తిని అం॥

౬

అణువునందున అణువుగా—పరమాణువందున బ్రహ్మవిహావయి
అపుసరంబులఁజక్కఁజేయగ—నవతరించెడి మూర్తి వి. అం॥

౭

ద్వైతమందున భాష్యకారుం-డద్వైతమందున శంకరుండును
గీతలందున వ్యాస దేవుఁడు-ప్రీతిబల్కు-ను ఘూర్తి తేజము, అం॥

౮

ఆంధ్రయుగములననాంధ్ర రాజుల-అంధకారము బారద్రోలుచు
ఆంధ్రశౌర్యముఁ బ్రబలఁ జేయుచు-ఆంధ్రజ్యోతిని మెఱయ జేసిన.

[నోటు:- ఈగీతము 4-6-1937 సం॥రమున వ్రాయబడినది,]

# మేలుకొలుపు.

౧

జీవుఁడా! వడి మేలుకోరా!

కావుమఁచును,బొంత కాకులు-కాలగతులను వ్రాలెరా! 1 జీ।

పాడియావు పయస్సుఁ బిండుచు-భారతాంబను గొల్వరా!
వీణమెట్లను మేళవించుచు-స్వేచ్ఛగానము పాడరా! 2 జీ।

ఋషులుపుట్టిన గడ్డనీయది-ఋక్కులింకిన మట్టిరా!
ఉపనిషత్తులు, గీతమఘువులు-ప్రీతిజిల్కిన పుట్టరా. 3 జీ।

ఆద, మీరువులుపుట్టినప్పుడె-ఆదిశంకరుఁ డుండెరా!
వాదులాడకనమ్మరా మరి-ఆదికాలమునీదిరా, 4 జీవుఁడా॥

## —• గ ద్య •—

ఇది శ్రీమత్ హారితస గోత్ర పవిత్ర, రాయప్పేశ్వర
పౌత్ర, సూర్యనారాయణమూర్త్యమాత్య పుత్ర,
మంగమాంబా గర్భ శుక్తి ముక్తాఫల,
సుకవిజనవిధేయ,
శ్రీ 'రాజరాజేశ్వర' కరుణాప్రసాదలబ్ధ కవితా భాసుర
క్రొవ్విడి వేంకటరత్నశర్మకవి- ప్రణీతంబైన
" ఆంధ్రసమ్మృతి " ఖండకావ్య మందు
ప్రథమోల్లాసము సర్వము
సంపూర్ణం.

# తప్పొప్పులు.

| పుట | పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| IV | ... | 2 | కటువులేని | కటువుగలుగు |
| VIII | ... | 4 | ద్వీపులాచ | ర్వీపులాచ |
| IX | ... | 5 | కవిత్వ్యము | కవిత్వము |
| X | ... | 15 | వతలంబించ | అవలంబించ |
| 2 | 2 | 2 | పర్జన్య | ఘర్జన్య |
| 2 | 4 | 4 | కళ్యాణముల్ | కల్యాణముల్ |
| 3 | 6 | 2 | సాధ్వులు | సాధ్వుల |
| 4 | 1 | 3 | విలఁసిల్లెక | విలసిల్లెక |
| 6 | 2 | 3 | ద్వైత | ద్వైత |
| ,, | 2 | 6 | పరివ్రాజక | పరమహంస |
| 7 | 1 | 6 | సాంధ్రజాతి | ఆంధ్రజాతి |
| 9 | 1 | 2 | జ్ఞాత్రరాహుల | జ్ఞోత్రరాహుల |
| 10 | 3 | 5 | కృష్ణ | కృష్ణుని |
| ,, | 1 | 12 | దలను | దలఁచు |
| ,, | 2 | 2 | సాయణా | సాయనా |
| 12 | 6 | 1 | సాంప్రదాయము | సంప్రదాయము |
| | 6 | 2 | శాగ్జ | శార్ఙ్గ |
| | | 11 | కారకుల్ | కాకుల |
| 13 | 7 | 9 | కార్వ | కార్య |
| 14 | 8 | 5 | ప్రాడి | ప్రౌఢి |
| | 9 | 9 | పింగళి | పింగలి |
| 18 | 10 | 3 | బిక్షువై | భిక్షువై |
| | | 9 | కృష్టరాట్ | కృష్ణరాట్ |
| 16 | 12 | 2 | పుష్కర | పుష్కర |
| 18 | 14 | 7 | కొలుపు | కొలువు |
| 20 | 3 | 8 | తెలింగాణ | తెలంగాణ |
| 24 | 9 | 8 | కాలవ | కాలువఁగార్చి, |
| 26 | 2 | 2 | ష్ణోదభావ | సాధుభావ |
| | | 2 | ఘంసేవ్యమ | సేవ్యంబవైః |
| 28 | 2, 3 | 5 | తల్లి | దేవి |

| | | | | |
|---|---|---|---|---|
| 30 | 1 | 4 | గూర్జువో | గూర్తువో! |
| | 4 | 2 | షోన్ | షో ! |
| | 4 | 7 | వేంగీశుల | వేంగీశుల, |
| 31 | 7 | 1 | పక్రింబైన | వక్రింబైన |
| 32 | 9 | 3 | క్షేత్రశు | క్షేత్రశ |
| ౸3 | 2 | 1 | నటాడెన్ | నట్టాడెన్ |
| 35 | 3 | 4 | చంద్రు | చంద్రుఁడు, |
| 36 | 4 | 4 | తారార్ఢియై | తారాళియై |
| 37 | 1 | 4 | రస్మి | రశ్మి |
| 39 | 2 | 3 | జుక్కయు | జుక్కయున్ |
| 40 | 4 | 4 | నైవర్ఘ్యమె | నైదర్ఘ్యమె |
| 41 | 5 | 5 | భట్టుకవి | భట్టుసకవి |
| | | 2 | పారు | పాఱు |
| 43 | 1 | 4 | కుండవాద్రిడు | కుండలీంద్రుఁడు |
| | కుకవి | 1 | పూజ్యంబు | పూజ్యఁబునై |
| 44 | 2 | 3 | గములం | గుములం |
| 48 | 6 | 2 | సర్వ్యంబాగ్లమె | సర్వంబాంగ్లమె |
| 49 | 10 | 1 | ఆడబడుచా! | ఆడపడు చా! |
| 53 | 1 | 1 | మూరుచుండ | మాఱుచుండ |
| | 4 | 2 | మరి | మఱి |
| | 4 | 4 | జనె | సనె |
| | | 5 | ప్రిభు | విభు |
| 54 | 5 | 1 | లారె | లాఱె |
| | 8 | 3 | జక్కడచకో | జగ్గడఁచకో! |
| 64 | 10 | 1 | బ్రిశంసింవగా | ప్రశంసింపగా |
| | | | నావిష్ణుపృధివీ | నావిష్ణుఃపృథివీ |
| 68 | 3 | 2 | యుక్తుల | యుక్తులన్ |
| 69 | 1 | 3 | భూత్థలిని | భూస్థలిని |
| 72 | 3 | 4 | వాప్రసతీవి | వాసితి |
| 8 | 1 | 7 | ఖ్యాతు | పూతు |
| 82,83, | 1,2,3 | 13,12,12 | దలచుఁమాంధ్రి | దలఁచుమాంధ్రి |
| 84 | గద్య | 9 | సర్వ్యము | సర్వము |
| పూర్వభాగము. 10 | 3 | 2 | సుహోసుహు | మహోమహు |

# ఉషాగ్రంథమాల.

అభిమానులు:-

[1] M. రమణారెడ్డిగారు—B. A. L. L. B- వకీలు;
సాకీఁ పెద్దపల్లి (జాగీరు.)

[2] చింతలపాటి సూర్యరాజుగారు, యీనాందారు,
గణపవరం, పశ్చిమ గోదావరి జిల్లా.

[3] Dr- K. మాధవరావుగారు, L- M- P-
సరిపల్లె?

[4] కొవ్విడి సూర్యప్రకాశరావుగారు,
యీనాందారు—గణపవరం.

[5] పెరుమాళ్ల వేంకటరావుగారు- Proprietor
కుసుమహరనాథ రైసుమిల్లు-గణపవరం.

[6] మాష్టరు మల్లేశ్వరరావుగారు- భాగవతారు-
గణపవరం.

# పత్రికాశక విరాళములు.

A- రాజపోషకులు :-

| | |
|---|---|
| కొల్లూరి సత్యనారాయణగుప్తగారు- Merchant సాకీ- గణపవరం. | కలార్లు 116–0–0 |

B- పోషకులు :-

| | |
|---|---|
| నంద్యాల లచ్చిరాజుగారి కు॥ సుబ్బరాజుగారు (Munsif) గణపవరం | 60–0–0 |

C- సభ్యులు :-

| | |
|---|---|
| 1 శ్రీకుసుమహరనాథ రైసుమిల్లు ప్రొప్రయిటర్లు, | 30–0–0 |
| 2 Dr- V బాపన్నగారు L M P | 25–0–0 |
| 3 సాగిరాజు రామరాజుగారు-యినాందారు. | 25–0–0 |
| 4. మిరియాల వెంకటరత్నంగారు గణపవరం | 25–0–0 |
| 5 మానాప్రగడ సుబ్బరావుగారు-గణపవరం, | 10–0–0 |